# మిసిమి

***"All that we are is the product of what we have thought,' is "We are what we think." –*** **Dammapada.**

సంపుటి 5 నవంబర్ 1993 సంచిక 4

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 5/- వార్షిక చందా రూ. 60/-

ముఖచిత్రం

తంజావూరు చిత్రణ

మిసిమి, నవంబర్ 1993

'మిసిమి' సంపాదకులకు,

మహాశయా, నమస్కారములు

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం గారి 'తెలుగులో అస్తిత్వవాదం' అనే వ్యాసము ఇదివరలో వేరొక సందర్భమునగూడ నేను చదివితిని. మీరు పంపినందున మరల ఇప్పుడుకూడ చదివితిని. ఆ వ్యాసమునందలి అభిప్రాయములను విమర్శించవలయునను భావనయే నాకులేదు. కాని కొన్ని విషయాలను పాఠకులకు తెలుపవలసి యున్నది :

శ్రీ సుదర్శనంగారు భవగద్గీత యందలి 'శ్రేయాన్ స్వధర్మో.....'' శ్లోకాన్ని ఉదాహరించి, అందలి 'స్వధర్మ' అనుదానికి 'వ్యక్తిధర్మము' అని అర్థము చెప్పిరి. అది గీతారచయిత యొక్క అభిప్రాయమునకే విరుద్ధము. గీతయందు 'స్వధర్మ' అనుదానికి 'తాను జన్మించిన వర్ణమునకు చెందిన ధర్మము' అనియే అర్థము. వేరొకచోట అర్జునుని ఉద్దేశించి చెప్పినపుడు 'స్వధర్మ మపిచావేక్ష్య.....' (రెండవ అధ్యాయము - 31వ శ్లోకం) అనుచోట 'స్వధర్మము' అనగా 'అర్జునుడు జన్మించిన క్షత్రియ వర్ణపు ధర్మము' అనియే అర్థమును భాష్యకర్తలు అందరును ఇచ్చిరి. ఆ అర్థమే అచట సరికుదురును. వేరొక రీతిగా చెప్పుటకు వీలే లేదు.

అంతేకాదు. గీత రూపొందిన చారిత్రాత్మక కాలమును గుర్తున ఉంచుకొనినపుడు సైతము ఆ అర్థమే సరికుదురును. బౌద్ధమువలన క్షత్రియధర్మము అంతరించినదనియు, దానిని రాజసూయ, అశ్వమేధాదుల వలనను, వర్ణధర్మ పునరుద్ధరణ వలనను పునరుద్ధరించవలెననియు పుష్యమిత్రుని పరిపాలన మొదలుగ జరిగిన యత్నమే భారతమునను, అందలి గీతలోను ప్రతిబింబించినది. భారతమునందలి ధర్మవ్యాధోపాఖ్యానము మొదలగునవియు ఇందుకు లక్ష్యములే.

కావున గీతలోని ఒక శ్లోకమునకు విపరీతము, అసంబద్ధము అగు ఒక అర్థాన్ని తమవాదపు సౌలభ్యానికై శ్రీ సుదర్శనంగారు ఇచ్చుట సముచితము కాదు.

ఇక అస్తిత్వవాదపు విషయము : ఏ యుగపు సాహిత్యమైనను ఆ యుగపు సామాజిక వ్యవస్థకు కొంతవరకు ప్రతిబింబముగనే ఉండగలదు. పాశ్చాత్యదేశములను లోగొనిన పారిశ్రామిక విప్లవమును, కేంద్రీకృత వస్తూత్పత్తియు, సామాజిక వ్యవస్థను కల్లోలితము చేసినవి. ఆ కల్లోలమే ఆ పాశ్చాత్యదేశ ములలో సాహిత్య, కళా ప్రపంచములందు వాస్తవిక, అధివాస్తవిక, అస్తిత్వ - ఇత్యాది వాదములుగ వేర్వేరు రూపులను గ్రహించినది. దాని గాలి కొంతవరకు మనకును సోకినది.

ఇందు ఆశ్చర్యపడవలసినది ఏదియు లేదు. వ్యక్తి-వ్యవస్థ. ఈ రెండింటిమధ్య సమన్వయము సాధించుట ఎట్లు? ఈ సమస్య ఈనాటిది కాదు. ప్రతి చారిత్రక యుగమున వివిధ రూపాలలో ఎదురగుచునున్నది. మత ధర్మాలు, ఆర్థిక-సామాజిక వాదాలు ఇవి అన్నియు ఆయా యుగాలలో ఆ సమస్యను పరిష్కరించుటకే కృషి చేసినవి. కాని 'కుక్కతోకను ఎంతగ సరిజేసినను మరల వంగిపోవుచునే యున్నది.'

'వ్యక్తి వెల్లువలో పూచిక పుల్ల కాదు, కాకూడదనే అస్తిత్వవాదం నొక్కి చెబుతుంది' అనిరి సుదర్శనంగారు. 'వెల్లువ' అనగా 'వ్యవస్థ' అని వారి అభిప్రాయము.

కాని వ్యక్తి వెల్లువలో పూచికపుల్ల కాగూడదనుకొన్నను కాక తప్పదేమో! అతని 'అస్తిత్వ'మే వ్యవస్థమీద ఆధారపడి యున్నది. దీనిని కాదనగలమా?

దీనిని గురించి ఎంతగనో చెప్పవచ్చును. కాని ఇప్పుడది సందర్భోచితము కాదు.

చీమకుర్తి శేషగిరిరావు

# అంబేద్కర్‌ను ప్రభావితం చేసిన ఆంధ్రుడు

**- టి. రవిచంద్ M.A.**

మద్రాసు క్రైస్తవ కళాశాలలో 1897-1906 . సంవత్సరాలలో పి. లక్ష్మీనరసు అనే గొప్ప పండితుడు, మేధావి, సాంఘిక సంస్కర్త ప్రొఫెసర్‌గా పనిచేశారు. ఆయన కేవలం సైన్సులో ప్రొఫెసర్ (ఆచార్యుడు) మాత్రమేకాదు, గొప్ప బౌద్ధపండితుడు, పరిశోధకుడు. ఆయన బౌద్ధ ధర్మంపై, కుల వ్యవస్థపై మౌలిక పరిశోధనలు చేశాడు. 1914 నుండి 1934 వరకు దక్షిణభారత బౌద్ధ సంఘానికి అధ్యక్షుడిగా ఉన్నారు. బౌద్ధ ధర్మాన్ని వివరిస్తూ ''ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'', ''వాటీజ్ బుద్ధిజం'', ''బుద్ధిజం అండ్ హిందూ రెలిజియన్'' (తమిళం), ''ది రెలిజియన్ ఆఫ్ ఏ మోడర్న్ బుద్ధిస్టు వంటి గ్రంథాల్ని రచించాడు. వీటిలో ''ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'' (బౌద్ధ ధర్మసారం) గ్రంథం భారతదేశంలోనే కాకుండా, ఇతర దేశాల్లోకూడా ప్రసిద్ధి చెందింది. జపాన్, జకొస్లొవేకియాలాంటి దేశాలలో ఈ పుస్తకం బహుళప్రచారం పొందింది. దీని తొలి ప్రచురణకు ప్రముఖ బౌద్ధధర్మ ప్రచారకుడు, మహాబోధి సొసైటీ అధ్యక్షుడయిన అంగారిక ధర్మపాల ఉత్తేజకరమైన పీఠిక రాసి, లక్ష్మీనరసు కృషిని కొనియాడారు. 1948లో ప్రచురించబడిన తృతీయ ముద్రణకు డా॥ బి.ఆర్. అంబేద్కర్ పీఠిక రాశారు. డా॥ బి.ఆర్. అంబేద్కర్‌ని ఈ రచన ఎంతో ప్రభావితం చేసింది. 1948లో ప్రముఖ ప్రచురణ సంస్థచేత ఈ పుస్తకాన్ని ప్రచురింపచేస్తూ దానికి రాసిన పీఠికలో డా॥ బి.ఆర్. అంబేద్కర్ ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు పుస్తకాన్ని గురించి ఇలా అన్నారు "The best book on Buddhism that has appeared so far.... complete in its treatment and lucid in its exposition" ఇప్పటివరకు బౌద్ధంపై వచ్చిన పుస్తకాలలో ఉత్తమమైనదిగా, రచనలో సంపూర్ణమైనదిగా, స్పష్టమైన వివరణతో కూడినదిగా అంబేద్కర్ ప్రశంసించారు. దీనితోబాటు ''వాటీజ్ బుద్ధిజం'' (బౌద్ధ ధర్మం అంటే ఏమిటి?) అనే మరో పుస్తకాన్ని ఆయన రచించాడు. ఈ పుస్తకం ప్రచురించబడేనాటికి బౌద్ధ ధర్మంపై జరిగిన పరిశోధనల వివరాలు ఇందులో పేర్కొనబడ్డాయి. ఇది తర్వాత జర్మన్ భాషలోకి కూడ అనువాదం చేయబడింది. మళ్ళీ జర్మనీనుండి జెక్ భాషలోకి ఈ పుస్తకం అనువాదం చేయబడింది. 1920 ప్రాంతంలో జకొస్లొవేకియాలో ప్రొఫెసర్ లక్ష్మీనరసు పర్యటించి బౌద్ధ ధర్మంపై ఉపన్యాసాలు ఇచ్చాడు.

దక్షిణ భారతదేశంలో బౌద్ధధర్మ పునరుద్ధరణ పండిట్ సి. ఇయోధి దాస్ నాయకత్వంలో ప్రారంభమైంది. ఆయన ఆర్థికంగా, సాంఘికంగా వెనుకబడిన ''పరయ'' కులంలో జన్మిం చాడు. వృత్తి రీత్యా వైద్యుడయినా, తమిళంలో గొప్ప పండితుడిగా పేరు పొందాడు. దక్షిణ భారతదేశంలో బౌద్ధధర్మ పునరుద్ధరణకు పాటుపడ్డ అగ్రగణ్యుడు పండిట్ ఇయోధిదాస్. బౌద్ధధర్మ ప్రేరణతో అస్పృశ్యతకు వ్యతిరేకంగా పాటుపడ్డ, పోరాడిన మానవతావాది ఆయన. పండిట్ ఇయోధిదాస్ అభిప్రాయం ప్రకారం నేడు అస్పృశ్యులుగా, అంటరాని వారిగా

పరిగణింపబడుతున్న వారు ఒకనాటి బౌద్ధ మతస్థులు. ఈ అభిప్రాయాన్ని తర్వాతకాలంలో డా॥ అంబేద్కర్ తమ "అస్పృశ్యు లెవరు?" అనే ప్రఖ్యాత గ్రంథంలో అద్వితీయమైన పరిశోధనతో వెల్లడించారు. పండిట్ ఇయోధి దాస్‌తోబాటు అప్పాదురై, ఎమ్. సింగారవేలు (దక్షిణ భారత కమ్యూనిస్టు ఉద్యమ పితామహుడు), పి. లక్ష్మీనరసు కలిసి పనిచేశారు. వీరిలో పండిట్ దాస్‌తోబాటు ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు బౌద్ధధర్మ వ్యాప్తికై విశేషమైన కృషి చేశాడు. గౌతమ బుద్ధుడ్ని సాంఘిక సమతావాది అని ప్రచారంచేస్తూ, వెనుకబడిన కులాల్ని-ముఖ్యంగా అంటరానివారిగా పరిగణించబడుతున్న అసంఖ్యాక దళిత ప్రజల్ని బౌద్ధ ధర్మంలోకి మార్చడానికి అహర్నిశలు కృషిచేశాడు. కొత్తగా బౌద్ధ ధర్మదీక్ష తీసుకొన్న వారికోసం ప్రత్యేకంగా అధ్యయన తరగతులు నిర్వహించి బౌద్ధ గ్రంథాల్ని అర్థమయ్యే విధంగా బోధించేవాడు. ఆయన తన జీవితకాలంలో నాలుగు బౌద్ధ మహాసభల్ని నిర్వహించాడు. ప్రధానంగా తమిళుల్లో, అందులోనూ దళిత వర్గాల్లో బౌద్ధ ధర్మవ్యాప్తికి విశిష్టమైన సేవ చేశారు. మద్రాసులోని దళిత ప్రజలు నేటికీ ఆయన్ని "గొప్ప ఆచార్యుడి" (Great Professor)గా స్మరించుకొంటుంటారు. 1934 సంవత్సరంలో నరసు మరణించే నాటికి బౌద్ధంపై మరొక పుస్తకాన్ని రచించారు. దానిపేరు 'ది రెలిజియన్ ఆఫ్ ఎ మోడరన్ బుద్ధిస్ట్' (ఆధునిక బౌద్ధ మతం) 1954లో డా॥ అంబేద్కర్ మద్రాసు నగరాన్ని సందర్శించినప్పుడు ఆ పుస్తకాన్ని ప్రచురించాలన్న ఆకాంక్షతో తమవెంట తీసుకెళ్ళారు.

ప్రొఫెసర్ లక్ష్మీనరసు బౌద్ధ ధర్మంపైనే కాకుండా, కుల వ్యవస్థపుట్టుక, పరిణామాలపై అనేక వ్యాసాలు వ్రాశారు. అప్పుడప్పుడు రాసిన ఆ వ్యాసాల్ని, అందిన కొత్త సమాచారంతో మెరుగుపరచి "ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్" (కులం - అధ్యయనం) పేరుతో 1922లో పుస్తకాన్ని వెలువరించాడు. దీనిలోనే "కులం అనేది అంగవైకల్యం కలిగించే జబ్బు" (Caste is a crippling disease); వైద్యుడి కర్తవ్య మేమిటంటే ఆ జబ్బు రాకుండా చూడాలి, ఒకవేళ అంటుకొంటే దాన్ని పూర్తిగా నిర్మూలించాలని స్పష్టంగా పేర్కొన్నాడు. భారతదేశ ప్రగతికి కులం గొప్ప అడ్డంకిగా, ఆటంకంగా వుందని చెబుతూ, దాన్ని నిర్మూలించాలంటే మనోవైజ్ఞానిక (మానసిక) విప్లవం ఆవశ్యకత ఎంతయినా వుందంటాడు ప్రొఫెసర్ లక్ష్మీనరసు. దీనికి రాసిన ముందు మాటలోనే రచయిత ముగింపుగా ఇంకా ఇలా అంటాడు: కుల నిర్మూలన జరగకుండా, సభ్యత, సంస్కారం, సమైక్యభావన కలిగిన నవతరాన్ని సృష్టించటం అసాధ్యం అనే విషయాన్ని నా పుస్తకాన్ని చదివిన కొంతమంది పాఠకుల్నయినా అంగీకరింప చేయగలిగితేచాలు". ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు రచించిన "ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం" (బౌద్ధ ధర్మసారం), "ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్" (కులం - ఒక అధ్యయనం) గ్రంథాలు డా॥ అబేంద్కర్‌ని విశేషంగా ప్రభావితం చేశాయి. డా॥ అబేంద్కర్ జీవితాన్ని సమగ్రంగా అధ్యయనం చేసినవారు, ఆయన బౌద్ధ ధర్మదీక్ష పొందటానికి కృష్ణాజీ అర్జున్ కిర్లోస్కర్ మరాఠీ భాషలో రచించిన "గౌతమ బుద్ధుడి జీవిత చరిత్ర", ప్రొఫెసర్ లక్ష్మీనరసు ఆంగ్లంలో రచించిన బౌద్ధ ధర్మసారం అనే గ్రంథాలు ఎంతగానో ప్రేరణ కలిగించాయని గ్రహించగలరు. కుల వ్యవస్థని అద్వితీయమైన తన పాండిత్యంతో, అపారమైన అనుభవంతో నిశితంగా విమర్శిస్తూ 1936లో డా॥ అబేంద్కర్ రచించిన "కుల నిర్మూలన" గ్రంథంపై ప్రొఫెసర్ లక్ష్మీనరసు "ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్" (1922) ప్రభావం కనిపిస్తుంది. 1922 సంవత్సరంలో రచించబడిన "కుల వ్యవస్థ - ఒక అధ్యయనం" ప్రభావం 1936లో రచించబడిన" కుల

నిర్మూలన''పై వుండటంలో ఆశ్చర్యం లేదు. అందులో ఇద్దరి సామాజిక దృక్పథాలు దాదాపు దగ్గరగా వున్నప్పుడు, తర్వాత తరంవారిపై ముందు తరంవారి ప్రభావం లేకుండా వుండదు. అయితే ఒక ఉదాహరణ మాత్రమే పాఠకుల దృష్టికి తెస్తాను. కుల వ్యవస్థని రక్షించడం కోసం కొందరు కుల తత్వవాదులు శాస్త్రీయ సిద్ధాంతం ముసుగులో జీవశాస్త్రాధారలతో ''రక్త స్వచ్ఛత'' సిద్ధాంతాన్ని ముందుకు తెస్తుంటారు. ఈ వాదాన్ని ఎదుర్కోవడానికి ప్రొఫెసర్ లక్ష్మీనరసు (ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్), డా॥ అంబేద్కర్ (ఎన్హిలేషన్ ఆఫ్ క్యాస్ట్)లు ఎంచుకున్న అంశాలలోని సారూప్యమును చూస్తే చాలా ఆశ్చర్యంగా వుంటుంది. రక్త స్వచ్ఛత (purity of blood) వాదం ఎంత హాస్యాస్పదమో వివరిస్తూ ఇద్దరూ డి.ఆర్. భండార్కర్ ''హైందవ జనాభాలో విదేశీ బీజాలు'' (Foreign Elements in the Hindu population) అనే వ్యాసంలోని అంశాల్ని తమ వాదనకు ఆలంబనగా పేర్కొంటారు. ప్రపంచంలో ఎక్కడా స్వచ్ఛమైన జాతికి చెందిన మానవులు లేరనీ, ప్రపంచంలోని అన్ని జాతుల ప్రజల్లోనూ రక్త సాంకర్యం జరుగుతూనే వచ్చిందనీ, ముఖ్యంగా భారతదేశంలోని ప్రజల విషయంలో ఇది ఎంతో యథార్థమని చెబుతూ ప్రొఫెసర్ నరసు, డా॥ అంబేద్కర్‌లు డి.ఆర్. భండార్కర్ వ్యాసంలోని అంశాన్ని పేర్కొన్నారు. ''ఇండియాలో విదేశీ రక్త సంమిశ్రణం లేని కులంగాని, వర్గంగాని వున్నట్టు లేదు. క్షత్రియులైన యోధవర్గానికి చెందిన రాజపుత్రుల లోను, మహారాష్ట్రులలోను మాత్రమే కాక - విదేశీ సంమిశ్రమ సంబంధం లేకుండా ఉన్నాయని భ్రమ పడుతున్న బ్రాహ్మణులలో కూడా విదేశీ రక్త సాంకర్యం ఉంది.'' ఇదే విధంగా కుల వ్యవస్థకు శాస్త్రీయ ప్రాతిపదిక లేదని నిరూపిస్తూ ఈ ఇద్దరు సామాజిక శాస్త్రజ్ఞులు ''మెంటల్ ప్రిన్సుపుల్ ఆఫ్ హెరిడిటీ'' గ్రంథంలో ప్రొఫెసర్ బెటిసన్ వాదనని ఇలాగే యథాతథంగా ఉటంకించారు.

ప్రొఫెసర్ లక్ష్మీనరసు వృత్తిరీత్యా శాస్త్రజ్ఞుడు. అందువల్ల కుల వ్యవస్థని వైజ్ఞానిక శాస్త్ర దృక్పథంతో లోతుగా అధ్యయనం చేశాడు. అటువంటి వ్యక్తి సామాజిక దృష్టి డా॥ అంబేద్కర్‌ని ప్రభావితం చేయడంలో ఆశ్చర్యం లేదు. ప్రముఖ అంబేద్కరీయుడైన డా॥ భగవాన్‌దాస్ ఈ విషయమై ఏమన్నాడో చూద్దాము. డా॥ అంబేద్కర్ రాసిన అరుదైన పీఠికల్ని (Rare prefaces) 1980లో సంకలనం చేస్తూ ఆ సంకలనానికి రాసిన ముందుమాట (పే. 6)లో డా॥ భగవాన్‌దాస్ ''ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'' డా॥ అంబేద్కర్ ''బుద్ధా అండ్ హిజ్ దమ్మ''ని ప్రభావితం చేసిన తీరుని గురించి ఇలా అన్నారు : "Essence of Buddhism is one of the best and very famous book on Buddhism. It is one of the few books on Buddhism which immensely influenced Dr. Ambedkar and the impact is evident in his monumental work "The Buddha and his Dhamma" which was posthumously published by the People's Education Society" బౌద్ధధర్మంపైవచ్చిన పుస్తకాలలో ''బౌద్ధధర్మసారం'' చాలా ప్రముఖమైన, ఒక మంచిపుస్తకం. బౌద్ధంపై వచ్చిన కొద్ది పుస్తకాలలో డా॥ అంబేద్కర్‌ని అపరిమితంగా (immensely) ప్రభావితం చేసిన పుస్తకాలలో ఇదివకటి. ఆ ప్రభావం స్పష్టంగా ఆయన మరణానంతరం పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ ద్వారా ప్రచురించబడిన అతి గొప్ప గ్రంథమైన ''బుద్ధుడు - ఆయన ధర్మం''లో కనిపిస్తుంది.

1948వ సంవత్సరంలో డా॥ అంబేద్కర్ ''ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'' గ్రంథాన్ని

బొంబాయిలోని ధాకర్ అండ్ కంపెనీచే ప్రచురింపచేశాడు. అంతేకాదు 1948నాటి తృతీయ ముద్రణకు ఆయన ఉత్తేజకరమైన పీఠికరాస్తూ, ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు జీవిత, సాహిత్యాల గురించి అప్పటి పాఠకులకు తెలియని అనేక ఆసక్తికరమైన విషయాలు వెల్లడించారు. ఆగ్రంథ రచయిత దృక్పథాన్ని ఎంతగానో కొనియాడారు. డా॥ అంబేద్కర్ మహారాష్ట్రలోని నాసిక్ దగ్గరలోని ఇయోలా (1935 అక్టోబర్, 13)లో "నేను హిందువుగా జన్మించాను. కాని హిందువుగా మరణించను" అని ప్రకటించిన నాటినుండి ఆయన తన దృష్టిని మతమార్పిడిపై మరల్చాడు. ముఖ్యంగా బౌద్ధ ధర్మంపై ఆసక్తి కనబరచి, దానికి సంబంధించిన అనేక గ్రంధాలు సేకరించడం, అధ్యయనం చేయడం, ప్రారంభించాడు. ఆ ప్రయత్నంలో ఆయన ప్రొఫెసర్ లక్ష్మీనరసు బౌద్ధ ధర్మంపై చేసిన విశిష్టమైన కృషిని గురించి విన్నాడు. ఆయన రచనల్ని చదవాలని ఆసక్తి కనబరిచాడు. ముఖ్యంగా లక్ష్మీనరసు "ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం" కోసం ఎంతగానో ప్రయత్నించాడు. 1907లో విడుదలైన ఆ పుస్తకంపై ఆనాటి ప్రముఖ పత్రికలు "హార్వర్డు ఓరియంటల్ సీరిస్", "బుద్ధిస్ట్ రివ్యూ" (లండన్), "జర్నల్ ఆఫ్ రాయల్ ఏసియాటిక్ సొసైటీ" (లండన్ - 1907), "ది మోడర్న్ రివ్యూ" (1908), "లుజాక్స్ ఓరియంటల్ లిస్ట్", "ఇంటర్నేషనల్ జర్నల్ ఆఫ్ ఎథిక్స్" (1908), "ది ఇండియన్ సోషల్ రిఫార్మర్" (బొంబాయి - 1908), "ది కార్లీలియన్" (రాజమండ్రి, సెప్టెంబర్ - 1907), "ది హిందు" (ఫిబ్రవరి 17, 1908), "ది స్పెక్టేటర్" (లండన్ - 1908), "ది ఇంగ్లీష్‌మన్" (కలకత్తా - 1907), "ది రంగూన్ గెజిట్" (1907), "ది ఇండియన్ మిర్రర్" (1907), "ది మద్రాసు టైమ్స్" (1907), "ది మహాబోధిజర్నల్" (జూలై, 1907), "ది ఓపెన్‌కోర్టు" (చికాగో - 1907)లలో గొప్ప పుస్తక సమీక్షలు వచ్చాయి. వాటిలో కొన్ని సమీక్షలాయన తర్వాత కాలంలో డా॥ అంబేద్కర్‌దృష్టికి వచ్చివుంటాయి. ఈ పుస్తకాన్ని ఆనాటి ఆంధ్రులు ఎలా స్వీకరించారో తెలుసుకోవాలంటే, నాటి తెలుగు సంస్కర్తలు నడుపుతున్న "కార్లీలియన్" (సంపాదకుడు, టంగుటూరి శ్రీరాములు, రాజమండ్రి, సెప్టెంబరు 1907) ఆంగ్ల పత్రికలో వచ్చిన పుస్తక సమీక్షయే తార్కాణం. "This treatise is not a mere compendiurm of the great Teacher's teachings. But it is full of Mr. Narasu's own sincere and original reflections. Mr. Narasu is an ardent disciple of Buddha and his ardent exposition of Buddha's life and light is both instructive and inspiring. He shows us how Buddha knocked on the head of the caste system by preaching that one was a BRAHMAN by actions, but not by birth... we heartily recommend Mr. Narasu's publication to all advocates of religious, social and political reform" 1907 నాటికి ఇంతకంటె గొప్ప సమీక్షని ఈ పుస్తకంపైఊహించగలమా?ఈ గ్రంథం కేవలం మహోపాధ్యాయుడి (బుద్ధుడి) బోధనల సంగ్రహమే కాదని, ఇది లక్ష్మీనరసు స్వంత మౌలిక ఆలోచనలతో, చిత్తశుద్ధితో నిండిపోయిందని, సమీక్షకులు ప్రశంసించారు. కర్మచేత ఒకడు బ్రాహ్మణుడు కాని జన్మతః ఒకడు బ్రాహ్మణుడు కాడని బోధించటంద్వారా బుద్ధుడు కుల వ్యవస్థపై దెబ్బ కొట్టాడని ఆయన మనకు చూపించాడు. ధార్మిక, సామాజిక, రాజకీయ సంస్కరణలను బోధించే వారందరికీ మేము ఈ ప్రచురణను హృదయపూర్వకంగా సిఫార్సు (recommend) చేస్తున్నామని గ్రంథ సమీక్షకులు అనటంద్వారా లక్ష్మీనరసుపై ఆనాటి సమకాలిక మేధావులకు ఎటువంటి వున్నతాభిప్రాయాలు వున్నది గ్రహించగలం. ఐతే 1938 నాటికి ఆ పుస్తకం

లభించటంలేదు. అప్పటికే ప్రొఫెసర్ నరసు చనిపోయాడు. అయినప్పటికీ ఆ పుస్తకంకోసం చేసే ప్రయత్నాన్ని డా॥ అంబేద్కర్ విరమించుకోలేదు. ఒకసారి అధికారిక పనిమీద కలకత్తా వెళ్ళినప్పుడు, భారతదేశంలో అతి పెద్దదైన నేషనల్ లైబ్రరీకి వెళ్ళాడు. ఎందుకంటే దేశంలో ఏ మారుమూల ప్రాంతంలో ప్రచురించబడిన పుస్తకమయినా, దానికి సంబంధించిన రెండు ప్రతుల్ని అక్కడికి పంపుతారు. అందుకని అక్కడ దొరుకుతుందేమోనని విచారించాడు. గ్రంథాలయంలోని కేటలాగ్‌లో లక్ష్మీనరసు పుస్తకం పేరు పేర్కొన్నా, పుస్తకం మటుకు దొరకలేదు. ఆ పుస్తకం పాడయిపోయిన పుస్తకాల జాబితాలో చేరింది. ఏదో విధంగా ప్రయత్నించి శిథిలమైన ఆ గ్రంథాన్ని డా॥ అంబేద్కర్ దృష్టికి తీసుకువస్తే, దాన్నిచూసి ఆయన ఆనందంతో కేరింతలు కొట్టినేంతపని చేశారట! తర్వాత దానిని తృతీయ ముద్రణగా స్వయంగా ఒక ప్రముఖ ప్రచురణ సంస్థచేత పునర్ముద్రణ చేయించాడు.

ప్రొఫెసర్ లక్ష్మీనరసు ''ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'' తృతీయ ముద్రణకు పీఠిక రాస్తూ డా॥ అంబేద్కర్ ఇలా అన్నారు : "The author of this book was Prof. P. Lakshmi Narasu, while I have great pleasure in introducing this book to the public, I confess that I had not met the author and know very little about his personal life" (ఈ పుస్తక రచయిత ఆచార్య పి. లక్ష్మీనరసు. ఈ పుస్తకాన్ని ప్రజలకు పరిచయం చేయడానికి చాలా ఆనందంగా వుంది. ఐతే గ్రంథరచయితను కలవలేక పోయానని వొప్పుకొం టున్నాను. ఆయన వ్యక్తిగత జీవితం గురించి నాకు తెలిసింది చాల తక్కువ). డా॥ బి. పట్టాభి సీతారామయ్యకు ఆయన వ్యక్తిగత స్నేహితుడని, ఆయనద్వారా తెలుసుకొన్న ముఖ్యమైన విషయాల్ని ఈ పీఠికలో వెల్లడిస్తున్నాననికూడ డా॥ అంబేద్కర్ చెప్పాడు. అసలు డా॥ అంబేద్కర్‌ని ప్రొఫెసర్ లక్ష్మీనరసు గ్రంథం ఎందుకని ఇంతగా ప్రభావితం చేసిందో తెలుసుకోవాల్సిన అవసరం వుంది. డా॥ అంబేద్కర్ 1935 నుండి హిందూమతం నుండి అస్పృశ్య ప్రజలకు విముక్తి కలిగించాలని ప్రయత్నిస్తున్నాడు. దానిలో భాగంగా తన ప్రజల అమానుష జీవితానికి కారణమైన హైందవ మతాన్ని వదలి బౌద్ధధర్మం స్వీకరించాలని, అప్పుడే వారి జీవితాలకి ఆధ్యాత్మికస్వేచ్ఛ, సమానత్వం, ఆత్మగౌరవం లభిస్తుందని ఆయన భావించాడు. అందులో భాగంగా బౌద్ధ ధర్మాన్ని సమగ్రంగా, శాస్త్రీయ, మానవతావాద, హేతువాద దృక్పథంతో పరిశీలించిన రచయితలు ఎవరయినా వున్నారా అని ఆయన అన్వేషిస్తున్న దశలో ప్రొఫెసర్ లక్ష్మీనరసు గ్రంథం డా॥ అంబేద్కర్ దృష్టిలోకి వచ్చింది. ఆ గ్రంథంలోని విషయాల్ని ఆయన ఎంతో నిశితంగా అధ్యయనం చేశాడు. అంతేకాదు 1907 నాటి తొలి ముద్రణకు అంగారిక ధర్మపాల లాంటి బౌద్ధధర్మ ప్రచారకుడు గ్రంథ రచయిత దృక్పథాన్ని శ్లాఘిస్తూరాసిన ముందుమాటలోని విషయాల్ని గ్రహించాడు. తన దృక్పథానికి అనుగుణంగా లక్ష్మీనరసు వెల్లడించిన విషయాలు వుండటంతో డా॥ అంబేద్కర్‌ని ఆ గ్రంథం అపరిమితంగా ప్రభావితం చేసింది.

''ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'' (బౌద్ధ ధర్మసారం) పదమూడు అధ్యాయాలుగా విభజించబడింది. ఒక్కొక్క అధ్యాయంలో ఒక ప్రధాన అంశాన్ని తీసుకొని పాళీ, సంస్కృత గ్రంథాలనుండి ఆకారాల్ని ఇచ్చాడు లక్ష్మీనరసు. పదమూడు అధ్యాయాల్లో ఆయన చర్చించిన ప్రధానమైన అంశాలు ఇవి : 1. చారిత్రక బుద్ధుడు (The Historic Buddha), 2. బౌద్ధంలో హేతువాదం (The Rationality in Buddhism), 3. బౌద్ధంలో నైతికత (The Morality

of Buddhism), 4. బౌద్ధం - కులం (Buddhism and Caste), 5. బౌద్ధంలో స్త్రీ (Woman in Buddhism), 6. ఆర్య సత్యాలు (The Four Great Truths), 7. బౌద్ధం - సన్యాసవాదం (Buddhism and Asceticism), 8. బౌద్ధం - నిరాశావాదం (Buddhism and Pessimism), 9. ఆర్య అష్టాంగ మార్గం, 10. ప్రపంచ సమస్యలాంటి అనేక విషయాల్ని మూల గ్రంథాల ఆధారంతో చర్చించాడు. ఆయన ఆలోచనా విధానం అంబేద్కర్‌ని అమితంగా ఆకర్షించింది. ఇదే విషయాన్ని గురించి అంబేద్కర్ ఇలా పేర్కొన్నాడు: "In recent times many people from different parts of India have been asking me to recommend a good book on Buddhism. In responding to their wishes I felt no hesitation in suggesting Prof. Narasu's book." (''ఈ మధ్యకాలంలో భారతదేశంలోని వివిధ ప్రాంతాలలోని చాలా మంది ప్రజలు బౌద్ధంపై ఒకమంచి పుస్తకం వుంటే సిఫార్సు చేయమని నన్ను అడుగుతు న్నారు. వారి ఆకాంక్షకు సమాధానంగా ఎటువంటి సంకోచానికి లోనవ్వకుండా ప్రొఫెసర్ లక్ష్మీనరసు పుస్తకాన్ని సూచిస్తున్నాను).

డా॥ అంబేద్కర్‌ని ఇంతంగా ప్రభావితం చేసిన ప్రొఫెసర్ లక్ష్మీనరసు ఎవరా అని పరిశీలిస్తుంటే ఆయన గురించి చాలా ఆసక్తికరమైన విషయాలు లభించాయి. డా॥ అంబేద్కర్ కూడా లక్ష్మీనరసు జీవిత-సాహిత్యాల గురించి వీలైనంత సమాచారం సేకరించాలని ప్రయ త్నించాడు. కాని నాటి కాయనకు లభించిన సమాచారం చాల తక్కువ. డా॥ అంబేద్కర్ తర్వాత ఎవరయినా ఆయన గురించి తెలుసుకోవటానికి ప్రయత్నించారా అని చూస్తే దాదాపు ఎవరూ లేరని చెప్పవచ్చు. డా॥ అంబేద్కర్‌తోనే ఆ ప్రయత్నం ఆగిపోయింది. తర్వాత ఎవరికీ ఈ విషయమై ఆసక్తి కలిగినట్లు కనిపించడం లేదు. కాని ఈమధ్య కందుకూరి వీరేశలింగంగారి ప్రియశిష్యుడు, యువ సంస్కర్త దేశిరాజు పెదబాపయ్య జీవిత చరిత్ర చదువుతుంటే ఒక ఆసక్తికరమైన అంశం నా దృష్టిలోకి వచ్చింది. దేశిరాజు పెద బాపయ్య మద్రాసు క్రైస్తవ కళాశాలలో ఉన్నత విద్యనభ్యసించారు. అదే సమయంలో ప్రొఫెసర్ లక్ష్మీనరసు అక్కడ అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. ఆయన ఆ రోజుల్లో చెన్న పట్నం (మద్రాసు)లో వున్న ప్రముఖ మేధావుల్లో అగ్రగణ్యుడు. ఆయన బౌద్ధ మతాభిమాని మాత్రమేకాదు, సంఘ సంస్కరణాభిలాషి. ఆయన స్వయంగా సంస్కరణోద్యమాల్లో పాల్గొన్నాడు. అనేక సాంఘిక సేవాకార్యక్రమాలు ఆయన చేపడుతుండేవాడు. ఆనాటి యువతరాన్ని ఉత్తేజ పరుస్తూ ఉపన్యసిస్తుండేవాడు. మద్రాసు క్రైసవ కళాశాలలో చదువుకునే విద్యార్థులు, ముఖ్యంగా ప్రగతికాముక భావాలుగల విద్యార్థులు ప్రొఫెసర్ లక్ష్మీనరసుని తరచు కలుస్తూ ఆయనద్వారా ప్రబోధం పొందుతుండేవారు. అటువంటి వారిలో దేశిరాజు పెద బాపయ్య ఒకడు. వారిద్దరి పరిచయాన్ని గురించి ''దేశిరాజు పెద బాపయ్య జీవిత చరిత్ర, స్మృతి మంజరి'' పుస్తక రచయిత కామరాజు హనుమంతరావు ఇలా రాశాడు: ''బాపయ్య గారికి ప్రొఫెసర్ లక్ష్మీనరసు నాయుడిగారి పరిచయముగూడ చెన్నపురిలో గలిగినది. వారియెడ భక్తిభావము గలిగి వారిని దర్శించుచు, వారి వలన కొంత ప్రబోధము బడసిరి. లక్ష్మీనరసు నాయుడుగారు బౌద్ధ మతాభిమానులయి తద్గ్రంథ పరిశోధనము విశేషముగ సలిపిన వారనియు, సంస్కరణాభిమానులనియు చదువరులు వినియుందురు. బాపయ్య గారప్పుడు నూతనముగా వ్యక్తపరచుటకు మొదలిడిన సంస్కరణాభిలాషకు గౌతమ బుద్ధుని జీవితాశయములు తోడ్పడి యుండును.'' ప్రొఫెసర్ లక్ష్మీనరసుగ ప్రసిద్ధుడైన సంస్కర్త

తన పేరు చివర ''నాయుడు'' అనే పదాన్ని చేర్చుకోలేదు. ఆయన రచనలన్నీ పి. లక్ష్మీనరసు పేరుతో మాత్రమే ప్రచురించబడ్డాయి. డా॥ అంబేద్కర్ కూడ లక్ష్మీనరసు గ్రంథానికి రాసిన పీఠికలో పి. లక్ష్మీనరసుగా పేర్కొన్నాడు. కాని ''లక్ష్మీనరసు నాయుడి''గా పేర్కొనలేదు. ఐతే ప్రొఫెసర్ లక్ష్మీనరసు వ్యక్తిగత జీవితానికి సంబంధించి లభించిన కొద్ది సమాచారంకూడా డా॥ పట్టాభి సీతారామయ్య ద్వారా సేకరించానని, డా. పట్టాభి, ప్రొఫెసర్ లక్ష్మీనరసులు స్నేహితులని డా॥ అంబేద్కర్ పేర్కొన్నాడు. దాన్నిబట్టి నాకొక అనుమానం కలిగింది. ప్రొఫెసర్ లక్ష్మీనరసు ఆంధ్రుడయి వుంటాడు, అందువల్లనే డా॥ పట్టాభికి ఆయనను గురించి అంత సన్నిహితంగా పరిచయం ఏర్పడి వుంటుందని. ఐతే దానికి సంబంధించిన ఆధారం మాత్రం లభించలేదు. పైన పేర్కొన్న దేశిరాజు పెద బాపయ్య జీవిత చరిత్రలో పేర్కొనబడ్డ ప్రొఫెసర్ లక్ష్మీ నరసునాయుడు, డా॥ అంబేద్కర్‌ని ప్రభావితం చేసిన పి. లక్ష్మీనరసు ఒకరా వేర్వేరు వ్యక్తులా అనే సందేహం నన్ను కలవరపరిచింది. దీనికి సంబంధించిన మరొక ఆసక్తికరమైన విషయం నాదృష్టికి వచ్చింది. లిటరరీ ఆర్కియాలజిస్టు, ప్రసిద్ధ పరిశోధకుడు బంగోరె తమిళమహాకవి సుబ్రహ్మణ్య భారతి రచించిన అసంపూర్ణ నవల ''చంద్రిక కథ''ను తెలుగులోకి అనువాదం చేసి, దానికి రాసిన ముందుమాటలో 1906 సంవత్సరంలో ''కృష్ణా పత్రిక''లో వచ్చిన ఒక వార్తాంశాన్ని ''తెలుగువారి తొలి వర్ణాంతర విందు'' అనే ఉపశీర్షికలో పేర్కొన్నారు. ఆ వార్తాంశం ప్రకారం ఆనాటి విందులో పాల్గొని, దానికి అధ్యక్షత వహించింది ప్రొఫెసర్ లక్ష్మీనరసు నాయుడు. అంటే ''కృష్ణాపత్రిక''లో పేర్కొన్న ప్రొఫెసర్ లక్ష్మీనరసు నాయుడుకూడ పి. లక్ష్మీనరసు మాదిరి సంస్కరణాభిమాని అని తెలుస్తుంది. అందువల్ల వారిద్దరు ఒక్కరేనన్న నా అనుమానం మరింత బలపడింది.

అంతే కాకుండా డా॥ అంబేద్కర్ ప్రొఫెసర్ లక్ష్మీనరసు ఆంగ్ల గ్రంథం ''ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'' తృతీయ ముద్రణకు రాసిన పీఠికలో ప్రొఫెసర్ నరసు గురించి ఇంకా ఇలా అన్నారు : "Prof. P. Lakshmi Narasu, B.A. was a prodigy of the last century. He was a graduate in Physics from the Madras Christian College. From being a tutor and demonstrator, he rose to the position of an Assistant Professor by 1897 and was given full charge of Physics and Chemistrey for the B.A. classes in 1898-99, during the absence of Prof. Moffatt, the permanent Professor of Physics on leave" (''ప్రొఫెసర్ లక్ష్మీనరసు, బి.ఎ. గతశతాబ్దంలోని అసాధారణ మేధావి (prodigy). మద్రాసు క్రైస్తవ కళాశాలనుండి భౌతిక శాస్త్రంలో పట్టభద్రుడయ్యాడు. ట్యూటర్‌గా, డిమోనిస్ట్రేటర్‌గా పనిచేస్తూ 1897 నాటికి అసిస్టెంట్ ప్రొఫెసర్ స్థాయికి ఎదిగాడు. భౌతిక శాస్త్రంలో శాశ్వత ఆచార్యుడయిన మొఫాట్ లేని సమయంలో 1898-99 సంవత్సరాలకు లక్ష్మీనరసుకి పూర్తి బాధ్యతలు అప్పగించారు). అంటే డా॥ అంబేద్కర్‌ని ప్రభావితం చేసిన ప్రొఫెసర్ లక్ష్మీనరసు కూడా మద్రాసు క్రైస్తవ కళాశాలలో ప్రొఫెసర్‌గా పనిచేసేవారని అంబేద్కర్ పీఠికలోనే ఆధారం దొరకటంతో నా అనుమానం పూర్తిగ బలపడింది. ఇదే విషయంపై ఏమయినా అదనపు సమాచారం దొరుకుతుందేమోనని మద్రాసు క్రైస్తవ కళాశాల వారిని సంప్రదించగ, నేను ఆశించిన దానికంటే ఎక్కువ సమాచారం వారినుండి అందెంది. మద్రాసు క్రైస్తవ కళాశాల ఆర్కివ్స్‌లో ప్రొఫెసర్ నరసుకి సంబంధించిన సమాచారాన్ని (1902-1922) ఫొటోస్టాట్ తీయించి పంపారు. ఇప్పటివరకు లభించిన సమాచారం ప్రకారం

ప్రొఫెసర్ పి. లక్ష్మినరసు పూర్తి పేరు పోకల లక్ష్మి నరసు నాయుడు. ఆయన 1882లో అదే కళాశాలనుండి భౌతిక శాస్త్రంలో పట్టభద్రులయ్యారు. బి.ఎ.లో ద్వితీయ భాషగా తెలుగు భాషని అధ్యయనం చేశారు. ఆ సంవత్సరం మద్రాసు విశ్వవిద్యాలయపు ''జాగిర్ దార్ ఆఫ్ ఆర్నిగోల్డు మెడల్'' బంగారు పతకాన్ని విద్యార్థి ఎమ్. శివగ్నానంతో పంచుకు న్నారు. ఆ కళాశాలలోనే 15 సం. అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేశారు. అక్కడ ఎంతకాలం పనిచేసినా ప్రొఫెసర్ పదవి లభించదు. ఎందుకంటే ఒక్క యూరోపియన్‌లే ప్రొఫెసర్ పదవికి అర్హులు. అందుచేతనే ఆయన 1909 (ఆగష్టు 13)లో అసిస్టెంట్ ప్రొఫెసర్ పదవికి రాజినామాచేసి, పచ్చయప్ప కళాశాలలో భౌతిక శాస్త్రంలో ప్రొఫెసర్‌గా చేరాడు. ప్రొఫెసర్ లక్ష్మినరసు ఎమ్.సి.సి.లో అసిస్టెంట్ ప్రొఫెసర్ పదవికి రాజీనామా చేసి, పచ్చయప్ప కళాశాలలో ప్రొఫెసర్‌గా చేరిన విషయాన్ని గురించి ఎమ్.సి.సి. క్యాలెండర్‌లో ఇలా పేర్కొన్నారు. "At the beginning of July, Mr. P. Lakshmi Narasu Naidu, B.A. resigned his position as Assistant Professor of Physical Sciences in order to take up the post of professor of Physical Sciences in Pachaiappa's College." మద్రాసు కళాశాలలో లభించిన సమాచారం ప్రకారం ప్రొఫెసర్ లక్ష్మినరసే పోకల లక్ష్మినరసు నాయుడు. బౌద్ధధర్మ ప్రభావం చేత ఆయన కుల వాచకమైన ''నాయుడు'' అనే పదాన్ని వదలుకున్నారని భావించవచ్చు. 1901-1902 నాటి ఎమ్.సి.సి. మ్యాగజైన్‌కి రాసిన "Fact and Imagination in Astronomy" (ఖగోళ శాస్త్రంలో వాస్తవం - ఊహ) వ్యాసం చివర పి. లక్ష్మినరసు అనిమాత్రమే తమ పేరు రాసుకున్నారు కాని లక్ష్మినరసు నాయుడని రాయలేదు. అంటే బౌద్ధ ధర్మం ప్రభావంవల్ల తన పేరులోని ''నాయుడు'' అనే పదాన్ని తొలగించుకున్నారని స్పష్టమౌతుంది. 1923లో ఎమ్.సి.సి. మ్యాగజైన్ (పత్రిక)లో ప్రొఫె సర్ లక్ష్మినరసు కుల వ్యవస్థపై రాసిన పుస్తకం ''ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్''ని సమీక్ష చేసిన, సమీక్షకుడు కూడ గ్రంథ రచయిత పేరుని పి. లక్ష్మి నరసుగ పేర్కొన్నారు. అందువల్లకూడ ప్రొఫెసర్ పి. లక్ష్మినరసు నాయుడే పి. లక్ష్మినరసు అని భావించటానికి ఎటువంటి సందేహానికి ఆస్కారం లేదు. ఆయన కేవలం బౌద్ధధర్మ పరిశోధకుడు, విద్యావేత్త మాత్రమే కాదు; ఆచరణాత్మక సంస్కరణవాది అని అంబేద్కర్ పేర్కొన్నారు. కుల వ్యవస్థ చెడుగుల్ని గురించి పరిశోధించిన తొలి పరిశోధకులలో ప్రొఫెసర్ పి. లక్ష్మినరసు ఒకరని కూడా డా॥ అంబేద్కర్ తన పీఠికలో ప్రస్తావించాడు. 1890 ప్రాంతాలలోనే ప్రొఫెసర్ లక్ష్మినరసు కుల వ్యవస్థకి వ్యతిరేకంగా, హిందూ మతంలోని దాని దౌష్ట్యానికి వ్యతిరేకంగా తిరుగుబాటు లేపినవాడిగా భావించవచ్చు. ఈ విషయాన్ని గురించి రాస్తూ డా॥ అంబేద్కర్ ఆయన గురించి ఇంకా ఇలా అన్నాడు : "Prof. Narasu was a social reformer, he fought caste to the best of his ability and raised the standrad of revolt against its tyranny in Hinduism, so early as in the nineties of the 19th centurey". ఇంత ఆచరణాత్మక సంఘ సంస్కర్త, తిరుగుబాటుదారుడు కాబట్టి ఆ రోజుల్లోనే కుల వాచకమైన ''నాయుడు'' పదాన్ని తన పేరునుండి తొలిగించుకున్నారు. అందుచేతనే పి. లక్ష్మినరసుగా, పి.ఎల్. నరసుగా ప్రసిద్ధి చెందాడు.

ఇప్పటివరకు నా అధ్యయనంలో తేలిన దానిప్రకారం డా॥ అంబేద్కర్‌ని ప్రభావితం చేసిన ''ఎస్సెన్స్ ఆఫ్ బుద్ధిజం'', ''ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్'' గ్రంథాల రచయిత ప్రొఫెసర్

పి. లక్ష్మీనరసు తెలుగువాడు. ఆయన అసలు పేరు పోకల లక్ష్మీనరసు ''నాయుడు''. అనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో చాల ప్రసిద్ధిచెందిన సంఘసంస్కర్త. బౌద్ధ ధర్మ సాహిత్యంలో మహాపండితుడు. ఆ సిద్ధాంతాన్ని హేతువాద, మానవతావాద దృక్పథంతో అధ్యయనంచేసిన తొలి పండితుడు. కుల వ్యవస్థ పుట్టుక, పరిణామాలపై మౌలిక పరిశోధనలుచేసి, ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానంతో అమానుషమైన, అశాస్త్రీయమైన కుల వ్యవస్థ నిర్మూలనకు పాటుపడ్డ తొలితరం భారతీయుల్లో అగ్రగణ్యుడు; తెలుగువారిలో ఆధునిక యుగంలో ప్రథముడు. సమకాలిక భారతదేశంలో కుల వ్యవస్థకి వ్యతిరేకంగా అసాధారణ పోరాటాన్ని సలిపిన డా॥ బి.ఆర్. అంబేద్కర్‌వంటి సామాజిక విప్లవ దార్శనికుణ్ణి ప్రభావితం చేసిన నవయుగ వైతాళికుడు. కందుకూరి వీరేశలింగం ప్రియశిష్యుడై, బాపట్ల ప్రాంతం వాడైన యువ సంఘసంస్కర్త దేశిరాజు పెద బాపయ్య లాంటి వారికి గురుతుల్యుడైన ప్రొఫెసర్ పోకల లక్ష్మీనరసు An unkonwn Scholarగా Reformerగా చరిత్రలో మిగిలిపోయారు. డా॥ అంబేద్కర్ కుల నిర్మూలనోద్యమం, నవబౌద్ధ ఉద్యమంవల్ల ప్రభావితుణ్ణయిన నేను, ప్రపంచ మేధావుల్లోనే అరుదైన మహామనీషి డా॥ అంబేద్కర్ బౌద్ధధర్మ అధ్యయనంలో, కుల వ్యవస్థపై చేసిన పరిశోధనల్లో ఆయన్ని విశేషంగా ప్రభావితం చేసిన తెలుగు సంస్కర్త జీవితాన్ని బయటకు తేవాలని ప్రయత్నిస్తున్నాను. ఆ ప్రయత్నంలో భాగమే ఈ వ్యాసం.

సంప్రదించిన రచనలు :


1. Essence of Buddhism - Prof. P. Laksmi Narasu, Bharatiya Publishing House, Delhi, 1976.
2. A Study of Caste - Prof. P. Lakshmi Narasu, Asian Educational Services, New Delhi, 1988.
3. Rare Prefaces Writen by Ambedkar, Selected and Edited by Dr. Bhagwan Das, Bheem Patrika Publications, Jullendur, 1980.
4. కుల నిర్మూలన - డా. అంబేద్కర్, అను : బోయి భీమన్న, HBT, హైదరాబాదు, 1990.
5. Ambedkar and Neo-Buddhist Movement, Edited by T.S. Wilkinsen and M.M. Thomas. The Christian Litrature Society, Madras, 1972.
6. దేశిరాజు పెద బాపయ్య జీవన స్మృతి మంజరి - కామరాజు హనుమంతరావు, రాజమండ్రి, 1960.
7. Madras Christian College Magazine, 1901, 1902, Vol.XIX.
8. Madras Christian College Magazine, Quarterly Series, Vol.III, 1923.


★ ఈ వ్యాస రచనకు సంబంధించిన కొంత ముఖ్యమైన సమాచారాన్ని పంపి సహకరించటమే కాకుండా, ప్రొఫెసర్ లక్ష్మీ నరసు ఎమ్.సి.సి. అధ్యాపక సిబ్బందితోకలసి వున్న ఛాయా చిత్రాల్ని (1903, 1905 నాటివి) పంపి తోడ్పడిన అసోసియేట్ లైబ్రేరియన్ (ఎమ్.సి.సి. ముల్లర్ మెమోరియల్ లైబ్రరీ) శ్రీమతి అన్నె దయానందన్ గారికి, అక్కడ తెలుగుశాఖలో పనిచేస్తున్న ప్రొఫెసర్ జి. వెంకటస్వామి నాయుడు గారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ★

(ఇంటర్వ్యూ: ఊహాజనితం)

# కె. కె. తో మధురవాణి

– పురాణం సుబ్రహ్మణ్యశర్మ

**మధురవాణి :** వీణమీద సంగీత సాధనచేస్తూ వుంటుంది. బుద్ధితక్కువ వాదం ఏమిటి కుటుంబరావు గారు. 'కోకు' వాద్యంబులలోన వీణా నర్వతిలో వీణ వాయించుకోక నీకు ఆ సైన్సు గొడవ ఎందుక?

**కొ.కు. :** బుద్ధి తక్కువవాదం కాదు. బుద్ధికొలత వాదం అసాధారణ అనుభవం అని రాశాను.

**మధు :** అసాధారణ అనుభవాలేమిటి? అంటే మీరు మూఢ నమ్మకాలను సమర్థిస్తున్నారా!

**కొ.కు. :** బుద్ధికొలతవాదం భౌతికవాదమే. నేను ఏ మూఢనమ్మకాలను సమర్థించటంలేదు.

**మధు :** మీరు చనిపోయినపుడు జరిగిన సంతాపసభలో ఏదో గొడవ జరిగిందటకద. అభ్యుదయ సాహిత్యానికి భౌతిక కృషిగా నివాళులు అర్పించారు. చివరలో మీరు స్యూడోసైన్సు భావాలకు గురై అశాస్త్రీయ భావాలను ప్రచారం చేయటం శోచనీయమని జన సాహితీ, సాంస్కృతిక సమాఖ్య అభిప్రాయపడింది.

**కొ.కు. :** ఏడిసింది.

**మధు :** మీరన్నట్లే సత్తెనపల్లినుంచి డా. పి. గిరిజగారు జనసాహితీ ఒక తుక్కు సంస్థకదా! కోకువంటి వ్యక్తినే మన్నించి, వీరిమీద కొరగాని విమర్శలు చేసినవారు, మీ అశాస్త్రీయ ధోరణిని ఖండించారు.

**కొ.కు. :** బుద్ధికొలత అనేది నాల్గవ పరిణామం అని నా ఉద్దేశ్యం. భౌతికవాదులు బుద్ధికివ్వాల్సినంత ప్రాముఖ్యం ఇవ్వలేదు.

**మధు :** త్రిపురనేని మధుసూదనరావు, కె.వి.రావు ఒప్పుకుంటె బుద్ధికొలత ఉన్నట్లేనా! వాళ్లెంత? -------- కొత్తను ద్వేషిస్తారు. విశ్వేశ్వరరావుగారు ఒక పుస్తకం వేసి కోకును సమర్థించారు. బుద్ధికి ప్రాధాన్యం ఇవ్వం అని కమ్యూనిస్టులు బుద్ధి గురించి అది లేనట్లు మాట్లాడటం వింతగా వుంది.

**కొ.కు. :** గురజాడ 'మనవాళ్ళు ఉత్తవెధవాయిలోయి' అన్నారు. బహుశా వీళ్ళేగావోలు. డా. బి. సూర్యనారాయణరెడ్డి ఆక్షేపిస్తూ ఒక వుత్తరం రాశాడట. నేను కోరింది కూడ విపులంగా చర్చజరగాలనే.

**మధు :** మిమ్మల్ని విమర్శించినవారు చాలా దారిద్ర్యంలో కొట్టుకుంటున్నా అది అనుభవాలా కాదా!

**కొ.కు. :** అన్నింటిని శంకించడం అనేది జ్ఞానదారిద్ర్యమేగాని శాస్త్రీయ పరిజ్ఞానం కాబోదు.

**మధు :** వేరు భావాలలోకి జారుకుంటున్నారని వారి భయం.

**కొ.కు. :** ఏదో విమర్శ చేయడం మన భౌతికవాదం, సోమరితనం అవుతుంది. మాటవరసకి శాస్త్రస్థాయి రాలేదని పేరా సైకాలజీని కొట్టిపడవేస్తారా?

మధు : సామాన్య ప్రజలకి తిండి, గుడ్డ, వినోదం తప్ప మరేమి అక్కరలేదు. మనం మరొకవిషయం ఆలోచిస్తే అది సాంఘిక అపచారం అవుతుందా!

కొ.కు. : అవుతుందో అవదో తెలియదు కాని నీది కడుపు నిండినవాళ్ళ భాష.

మధు : ఏ భావజాలమైనా ప్రజల కడుపు కొట్టడానికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను దోహదం చేసితీరుతుంది.

కొ.కు. : వాళ్ళకి కడుపు నింపుకోటానికి అవసరమైన పోరాటచైతన్యం ఇస్తే చాలని కమ్యూనిస్టుల అభిప్రాయం. బుద్ధికొలత వ్యాసాలు బీదప్రజలకి తోడ్పడవు

మధు : సామ్రాజ్యవాదుల, భూస్వాముల, కాంగ్రెస్ వాళ్ళ దోపిడీని నిర్మూలించడానికి బుద్ధికొలత వ్యాసాలు తోడ్పడతాయ?

కొ.కు. : నేను అశాస్త్రీయ నిర్ధారణను చేశారని అంటున్నారు. నాబుద్ధి కొలతవాదం గురించి మేధావులు కావాల్సినన్ని పరిశోధనలు చేసుకోవచ్చు. నా ప్రతిపాదనలని తిరస్కరించినా సంతోషమేగాని భరించలేని మేధావుల సోమరితనానికి నా జోహారులు.

మధు : మార్క్సిస్టులనుకున్నవాళ్ళు సంశయవాదులు. మీబుద్ధికొలత వ్యాసాలు భావవాదాన్ని, మాంధ్యాన్ని సమర్ధిస్తామని మార్క్సిస్టులు అంటున్నారు.

కొ.కు. : అవును నేను నా బుద్ధికొలత వాదంతో మార్క్సిజాన్ని సమర్ధిస్తున్నాను.

మధు : మీరు ప్రజలను తప్పుదారిన పట్టించి వారిపోరాటాన్ని, చైతన్యాన్ని నిర్వీర్యం చేసేరంటున్నారు. అతీత శక్తులనేవి ఎండమావులు. పేరాసైకాలజీ కుహనా శాస్త్రం. మీరు వాటిని నమ్ముతారు. వాటికి శాస్త్రీయమైన తొడుగు తొడుగుతారు.

కొ.కు. : అసలు బుద్ధి అనేది జగత్తులో ఒక ప్రత్యేకవిభాగం అన్నదాంతో మీరందరూ ఏకీభవించాలి.

మధు : శాస్త్ర నియమాలుకొన్ని శాస్త్ర ప్రగతికి అడ్డుగా వుంటాయని నేను నమ్ముతాను.

కొ.కు. : శాస్త్రజ్ఞానంలో చరమసత్యం అంటూ ఏదీ లేదు. ప్రతిదీ తాత్కాలికమే. జ్ఞానవృద్ధి అయ్యేకొద్దీ సదా సంత్‌సంశయాలు బలమైనవి. కాలము, స్థలము అనేవి సాపేక్షికాలు.

మధు : శాస్త్రజ్ఞులు తెలుసుకొన్నవి పాక్షిక సంశయాలే.

కొ.కు. : శాస్త్రజ్ఞులకు సత్యాలలో నమ్మకముంటుంది. కాని పూర్తి సత్యాలు వాళ్ళకి తెలియవు.

మధు : ఎడింగ్‌టన్, జీన్స్, ఐసన్‌బర్గ్‌లను మీరు ఏమంటారు?

కొ.కు. : అజ్ఞేయతా వాదానికి గురైన శాస్త్రజ్ఞులు అంటాను.

మధు : సోషల్ సామ్రాజ్యవాదం అంటే ఏమిటండి?

కొ.కు. : మాటలలో సోషలిజం, చేతలలో సామ్రాజ్యవాదం అనుసరించటాన్నే సోషల్ సామ్రాజ్యవాదం అని అన్నారు.

మధు : మీరు వ్యసనంలో వుంటూనే రష్యా, తూర్పుయూరప్ దేశాలను సోషలిస్టు దేశాలుగా ఎలా భావించారు. సోవియట్ శాస్త్రవేత్తలు పచ్చి భౌతికవాదులు. అసాధారణ అనుభవాలను భౌతికవాదం దృష్ట్యా మార్క్సిస్టు దృక్పథంతో సమన్వయింప

యత్నిస్తారు. మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం అంటూ గంతులు వేస్తుంటారు మీ విరసంవాళ్లు. వాళ్ళు మీ బుద్ధికొలత వాదాన్ని వ్యతిరేకిస్తున్నారు?

కొ.కు. : మార్క్సిజం పిడివాదం కాదు. కార్మికవర్గం వృద్ధిచెంది పెట్టుబడిదారీకి వ్యతిరేకంగా వుద్యమించటంలో ఇది వచ్చింది.

మధు : మార్క్సిజాన్ని బుద్ధికొలతలో ఆచరించటం అంటే దాన్ని పిడివాదం చేయడం కాదా!

కొ.కు. : మనం తప్పులనుండి లోపాలనుండి నేర్చుకుంటాము. దీనినే ఆచరణ అంటారు.

మధు : మీరు దయ్యాలున్నాయని అంటారు.

కొ.కు. : చచ్చిపోయిన మనిషివచ్చి సోదిలో మాట్లాడటం నేను స్వయంగా ఎరుగుదును. సైకోయనాలసిస్ పూర్తిగా రుజువు అయ్యింది. చాలా విషయాలు విజ్ఞాన శాస్త్రంల్లో భాగంగా పరిగణింపబడలేదు. అదే నాదుర్గ.

మధు : మరణానంతరం మనిషి ఏదో రూపంలో వుంటాడని మీకు నమ్మకం వుందా?

కొ.కు. : ప్రపంచమంతటా అనేకచోట్ల ఆయుధాలను, దాసీలను, నగలను, పెళ్ళాలను పాతిపెట్టడాలు చూస్తూ వుంటే చచ్చినవాళ్ళు బతికివున్నప్పటి మనస్తత్వంతో జీవించి వుంటారని నమ్మటానిక వీలవుతుంది.

మధు : మరణానంతర జీవితాన్ని మీడియంలను నమ్ముతూ నానాగొడవ చేశారు. అంటే అశాస్త్రీయమైన నమ్మకాలకు మేలిముసుగు తొడిగినట్లు కాదా!

కొ.కు. : హేతువాదం భౌతికవాదం సత్యాన్వేషణ అని ప్రగతి నిరోధకులుగా శాస్త్రవిజ్ఞానం విస్తరించకుండా అడ్డు పడుతున్నారు మూఢ మార్క్సిస్టులు. అదే నా బాధ.

మధు : సామాజిక ప్రోద్బలంతో తద్దినాలు పెట్టి సత్యనారాయణ వ్రతాలు చేసే మార్క్సిస్టుల్ని మీరేమంటారు? చూసీ చూడనట్లు ఊరుకోవాలా? రంగనాయకమ్మని తిట్టినట్టు తిట్టాలా?

కొ.కు. : వారు అపనులు చేయరాదు. బుద్ధికొలతలు సరియైన పొలిమేరల్లో లేక వాళ్ళు వాళ్ళూ అపనులు చేస్తున్నారంటాను.

మధు : అవన్నీ వ్యక్తిగత బలహీనతలు. బుద్ధికొలత అనేదాన్ని ఒక తిట్టుగా అభివృద్ధి చేశారంటున్నారు.

కొ.కు. : విరసం సభ్యులకి కూడా భార్యలుంటారు కాబట్టి వారి విశ్వాసాలను పాటిస్తే తప్పులేదనుకొంటాను. బుద్ధిని మెదడుకు అతీతం చెయ్యడం భావవాదం కాదా?

మధు : బుద్ధిస్థల కలలు మాదిరే అనాదిది. జ్ఞానేంద్రియాలు లేనిచోట బుద్ధి వుండదుకదా!

కొ.కు. : అంటే స్మరణ కోల్పోయినపుడు అంటే నేను అనే జ్ఞానం కోల్పోయిననాడు సామాజిక స్పృహ కోల్పోయిన వాడితో సమానం కదా!

మధు : భిన్న వ్యక్తిత్వం అంటే ఏమిటి?

కొ.కు. : అనేక రకాల వ్యక్తిత్వాలు ప్రదర్శించడం. ఒకటి చేస్తున్నప్పుడు మరోటి గుర్తువుండకపోవటం. ఇలాంటివాటిని స్ప్లిట్ పర్సనాలిటీలు అని అంటారు.

మధు : మీ బుద్ధికొలతవాదం చూసి విరసంవాళ్ళు మీరు వాళ్ళని భావవాదుల లోకి

జరిపిస్తున్నారని భయపడుతున్నారు. కాని ఆవాదం అక్కడ వదిలేసి మరో విషయం ఎత్తుకుందాము.

కొ.కు. : కొత్త అంటే జడుపు భయం అనుమానం కదా!

మధు : మీరు చందమామలో ఎలకల కథ బస్తీవి, పల్లెటూరివి రాశారు గుర్తుందా?

కొ.కు. : రాశాను. పల్లెటూళ్ళ నుండి వచ్చిన వాడ్నినేను. అది యింకా నీకు గుర్తుందీ!

మధు : బకాసురుడి కథ కూడా గుర్తుంది.

కొ.కు. : మహాభారతంలో బకాసురకథను నాభావాల కనుగుణంగా మార్చిరాశా.

మధు : నన్నయ్య లాటివాళ్ళు యీ కాలంలో వుంటే వాళ్ళని కూడా ఎక్కిరించారు. బ్రాహ్మణుల జోలికి పిశాచాలు రాకూడదని రూలు కాబోలు.

కొ.కు. : అందులో బకాసురుడి బెదడను రాజు స్వార్థానికి వాడుకుంటాడు. బండివాడి మాటలకు మంత్రి తట్టుకోలేకపోతాడు.

మధు : బకాసురుని కథ రీతిలో పురాణకథల్ని కొన్ని తిరిగిరాయాల్సి వుంది.

కొ.కు. : పాతకథల్ని కొత్త రీతిలో చెప్పాలి.

మధు : మధ్య తరగతి జీవితాలను మీరు బాగా చిత్రించారంటారు.

కొ.కు. : మధ్య తరగతి సమస్యలను వాస్తవంగా చిత్రించడం 'బెదిరిన మనుష్యులు', 'బ్రతుకు భయం', 'కొత్తకోడలు' కథల్లో చెప్పాను.

మధు : పై కులంవాళ్ళలాగ వుండాలని క్రిందకులం వాళ్ళు ప్రయత్నిస్తారని మీరు ఎందుకను కుంటారు?

కొ.కు. : హరిజన యువకుల ప్రవర్తనచూసి - పైకులంవాళ్ళలాగ కనపడాలని హరిజనులు వారిని అనుకరించబోయి కుక్కచావు చస్తారు.

మధు : మీరు సినిమారంగాన్ని సజీవంగా ఎలా చిత్రించగలిగారు?

కొ.కు. : మద్రాసులో వుండబట్టి

మధు : మీరు డిటెక్టివ్ నవలలు రాశారా?

కొ.కు. : డిటెక్టివ్‌లను ఎక్కిరిస్తూ కెయాస్ కథలు రాశాను. అవి చాలా పాపులర్.

మధు : మంచి జర్నలిస్టు ఎలా వుండాలి.

కొ.కు. : ఇలాల్లి ముచ్చట్లు ఇంట్లో అన్నట్లు సోషల్ ఇన్‌పాబిషన్సుకు గొడ్డలిపెట్టగా వుండాలి.

మధు : ఆ సౌజన్యారావు పంతులుగాక మీరు నాకు తగిలివుంటే -

కొ.కు. : ఆ తగిలి వుంటే ఏమి చేసేదానివి?

మధు : శుభ్రంగా మిమ్మల్ని పెళ్ళాడేదాన్ని. నన్ను వుంచుకోవడానికి అభ్యంతరమా?

కొ.కు. : అది ఫ్యూడల్ వాసన పనికిరాదు.

మధు : మిమ్మల్ని పెళ్ళాడితే మీతో వుండి జనవాక్య మండలిలో గద్దర్ పాటలకు డాన్సు చేసేదాన్ని.

కొ.కు. : నువ్వూ నువ్వులా వుంటేనే అందం.

మధు : నేను నేనులావుంటే, వుండనిచ్చే సమాజం రావాలికదా!

కొ.కు. : బూర్జువా సమాజం పోయాక వస్తుందిలే.

మధు : మంచిది. (సమాప్తం)

# సంస్కృత రూపకములు

## పరిచయ పట్టిక

డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు
(తెలుగు నాటక వికాసము)

### భాణ ప్రహసనకర్తలు :

'చతుర్భాణి' అనుపేర శ్రీ మా. రామకృష్ణకవిగారు నాలుగు భాణములను ప్రకటించి యున్నారు - 1. ఉభయాభిసారిక (వరరుచి విరచితము). 2. పద్మ ప్రాభృతకము (శూద్రకవిరచితము). 3. ధూర్తవిటసంవాదము (ఈశ్వరదత్త విరచితము). 4. పాదతాడిత కము (శ్యామిల కవి రచితము). వరరుచి పాణిని సమకాలికుడనియు, శూద్రకుడు ఆంధ్ర భృత్య రాజైన స్వాతి ఆస్థానకవి అనియు, ఈశ్వరదత్తుని కాలము తెలియదనియు, శ్యామిల కుడు క్రీ.శ. 800-900 మధ్యవాడనియు సంపాదకులు పేర్కొనినారు. ఈ నాలుగింటియం దును రచనావిధాన మొకేవిధముగా కన్పట్టగలదు. 13వ శతాబ్ది తరువాత బయలుదేరిన పెక్కు భాణములకంటె ఇవి చాల విశిష్టములై, వానికంటె ప్రాచీనములుగా పరిగణింపబడుచు న్నవి.

పల్లవరాజైన మహేంద్ర విక్రమవర్మ (క్రీ.శ. 620 ప్రాంతముల) 'మత్తవిలాస' (ఏకాంక) ప్రహసనమును రచించెను. బౌద్ధ-కాపాలిక-పాశుపత మతములవారి అసభ్య వర్తనములిందు ప్రదర్శింపబడెను. బోధాయన విరచితమని చెప్పబడెడి 'భగవదజ్జుకీయ' ప్రహసనమింకొకటి కలదు. కాని, దీనినికూడ విక్రమవర్మయే రచించి యుండవచ్చునని ఊహించుట కవకాశము కలదు. పాత్రలలోని వైపరీత్యముచేకాక, సన్నివేశములందలి వైపరీత్యముచే హాస్యము సృష్టింప బడుట యిందలి విశిష్టత.

### శ్రీహర్షుడు :

ప్రియదర్శికా-రత్నావళీ-నాగానందముల కర్తయగు ఈ శ్రీహర్షుడు నైషధకర్తయగు శ్రీహర్షుని (క్రీ.శ. 12 వ.శ.) కంటె భిన్నుడును, ప్రాచీనుడును. రూపకకర్త అయిన ఈ శ్రీహర్షుడు శ్రీహర్షవర్ధన శిలాదిత్య బిరుదాంచితుడై క్రీ.శ. 7వ శతాబ్ది ప్రథమ భాగమున స్థానేశ్వర-కన్యాకుబ్జములను పాలించెను. శ్రీహర్షుని నాటకములను నాటి విదేశయాత్రికులు కూడ ప్రశంసించియున్నారు. బాణుడు శ్రీహర్షుని ఆస్థానకవియే. బాణుడే ఈ రూపకము లను రచించియుండునని కొందరి అనుమానము; కాని, ఇది విశ్వసనీయము కాజాలదు. ప్రియదర్శికా-రత్నావళులు రెండును నాటికలు. రెండింటను కథ ఇంచుమించు సమానమే. ఇవి మాళవికాగ్ని మిత్రమును పోలియుండును. నాగానందము నాటకము. ఇది ఉత్తమ నాటకములలో నొకటి. రత్నావళి ఆలంకారిక సూత్రములను తు, చ తప్పకుండ అనుసరిం చిన రచన. అందుచేత శ్రీహర్షుని యీ నాటికకు రూపకవిమర్శలో విశిష్టమైన స్థానము కలదు.

## విశాఖ దత్తుడు :

విశాఖదత్తుని కాలము సంశయాస్పదము. ఈతని ముద్రారాక్షసమును ధనంజయుడు పేర్కొనియుండటచేత ఇది క్రీ.శ. 10వ శతాబ్దికి ముందరి రచన అనుట స్పష్టము. ''కాళిదాసాదుల నాటకములను ఎక్కువగా 'Poetic dramas' అని అనుటకు వీలున్నది; ఇంక ముద్రారాక్షసమొక్కటియే సంస్కృతమందు సిసలైన నాటకము'' అని కొందరు పేర్కొందురు. ప్రసిద్ధమైన రాజమార్గమును వీడి శూద్రకుడొక క్రొత్తదారిని త్రొక్కగా విశాఖదత్తుడింకొక క్రొత్తదారిని త్రొక్కెను. మృచ్ఛకటికములో రాజకీయములు అనుషంగి యములే; కాని, ఇందు అవియే ప్రధానములు. విశాఖదత్తుడు చారిత్రకమైన కథను స్వీకరించి, పెక్కు క్రొత్త కల్పనలను జోడించెను. మంత్రి రాక్షసుని, అతని ముద్రిక సాహాయ్యముచేతనే జయించుట ఇందు ప్రధానమగుటచేత ఇది 'ముద్రారాక్షస' మనబడినది. ఇందు నాయిక లేకపోవుట ఒక విశిష్టత, 'దేవీ చంద్రగుప్తము' అనెడి నాటకమునుగూడ ఈతడే రచించినట్లు చెప్పుదురు.

## భట్టనారాయణుడు :

ఈతని కాలముకూడ స్పష్టముగా తెలియదు. వామన-ఆనందవర్ధనులు భట్టనారాయణుని వేణీసంహారమును పేర్కొని యుండుటచేత ఇతడు నిశ్చయముగా క్రీ.శ. 800కు పూర్వుడు. వేణీసంహారమును రౌద్రరస ప్రధానమైన నాటకమునుగా పేర్కొనవచ్చును. ఇందు ఆలంకా రిక సూత్రములు చాలా జాగ్రత్తగా అనుసరింపబడినవి. కొంత కావ్యధోరణియు, కొంత నాటకధోరణియు కలిగిన దీనిని 'Declematory drama' అని పేర్కొందురు.

## భవభూతి :

భవభూతి - వాక్పతిరాజులు యశోవర్మ ఆస్థానకవులని కల్హణుడు రాజతరంగిణిలో పేర్కొనెను. వామనుడు భవభూతిని పేర్కొనియుండెను. అందుచే ఇతడు 8వ శతాబ్ది ప్రారంభ మందుండెనని తలంపబడుచున్నది. ఇతడు విదర్భదేశీయుడని చెప్పబడుచున్నను, ఆంధ్రుడు అయి యుండునని ఊహించుట కవకాశము కలదు. మహావీరచరితము, మాలతీ మాధవము, ఉత్తరరామచరితము అనునవి మూడును భవభూతి రూపకములు. ఇందు రెండవది ప్రకరణము; తక్కినవి నాటకములు. ఇవి మూడింట వరుసగా ఒకదానికంటె ఇంకొకటి గుణాధికము. ''ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే'' అనునది ప్రసిద్ధమేకదా. శుద్ధవిషాద రూపకము కావలసిన ఉత్తరరామచరితము నీతడు ఆహ్లాదరూపమునుగా మలచు కొనెను. ఇందలి కవిత్వము ప్రశస్తమైనది. పవిత్ర దాంపత్యమునందలి తరితీపులను కనుగొన గల్గిన శిల్పి యితడు. కవిత్వముకూడ విశిష్టమైనది.

## మురారి :

మురారి కాలముకూడ సరిగా తెలియదు. క్రీ.శ. 9, 10 శతాబ్దము లందుండెనని ఊహింపవచ్చును. ఇతడు 'బాలవాల్మీకి' బిరుదాంచితుడు. ''గురుకులక్లిష్టో మురారిః కవిః'' అని చెప్పుకొనినాడు. ఈతని 'అనర్ఘ రాఘవము' గంభీరతకు ఉదాహరణమని తరువాతి వారిచేత పొగడ్తనందినది. ఇందు రూపకత్వముకంటె కావ్యత్వమే అధికము. ఇట్టివానిని

'Closet dramas' అందురు. రూపకకర్తలు తమ్ము గూర్చి పొగడుకొనుట మురారితో ఆరంభ మైనదని చెప్పవచ్చును

## రాజశేఖరుడు :

ఇతడు కనోజ్ రాజగు మహేంద్రపాలునకు ఉపాధ్యాయుడగుటచేతను, ఆనందవర్ధనుని పేర్కొని యుండుటచేతను క్రీ.శ. 850-920 ప్రాంతముల వాడగుచున్నాడు. రాజశేఖరుని భార్య అవంతిసుందరి. ఈమె గొప్ప విదుషి; అలంకార శాస్త్ర విషయమున ఈమె అభిప్రాయములను రాజశేఖరుడు తన కావ్యమీమాంసయందు సగౌరవముగా పేర్కొనెను. ఈ కావ్యమీమాంసకు అలంకారశాస్త్రమందొక ప్రత్యేకస్థానము కలదు. రాజశేఖరుని నాలుగు రూపకములిప్పుడు లభ్యమగుచున్నవి - 1. బాలరామాయణము (నాటకము) - నాటికి రాజశేఖరుడు 'బాలకవి' మాత్రమే. ఇందు ఒక్కొక్క అంకమే ఒక్కొక్క నాటకమంత విశాలముగా నుండును. 2. బాలభారతము (నాటకము) - దీనికి 'ప్రచండ పాండవ' మను నామాంతరము కలదు; ఇందలి 2 అంకములు మాత్రమే లభించినవి. 3. కర్పూరమంజరి - ఇది ప్రాకృతభాషయందు రచింపబడిన సట్టకము. అవంతి సుందరి ఆజ్ఞానుసారముగా ఇది ప్రదర్శింపబడినట్లు ప్రస్తావనలోనున్నది. ఇందు అంకములు 'జవనికాంతరములు' అనబడినవి. 4. విద్ధసాలభంజిక - ఇది నాటిక. కథాకల్పనాదులయందు అంతగా విశిష్టత కానరాదు. మొత్తముమీద రాజశేఖరునిది చక్కని కవిత్వము.

## ఇతర రూపక కర్తలు :

క్రీ.శ. 8, 9 శతాబ్దముల తరువాత రచింపబడిన రూపకములు విమర్శకుల ప్రశంసల నందలేకపోవుచున్నవి. ఇంక క్రీ.శ. 12వ శతాబ్దినాటికి సంస్కృత రూపకరచన క్షీణదశలో పడినదని చెప్పవచ్చును (రచన మాత్రము సాగుచునేయున్నదని మరువరాదు). ఈ అర్వాచీన రూపకములలో కొంత విశిష్టతకలవి - వామనభట్టబాణుని పార్వతీపరిణయము, అనంగహర్షమాత్రరాజు తాపసవత్సరాజము, శక్తిభద్రుని ఆశ్చర్యచూడామణి, జయదేవుని ప్రసన్న రాఘవము, దిఙ్నాగుని కుందమాల, రామభద్ర దీక్షితుని జానకీ పరిణయము, కులశేఖరుని తపతీ సంవరణము, రవివర్మ ప్రద్యుమ్నాభ్యుదయము, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయము, విశ్వనాథుని సౌగంధికాపహరణము, రాజచూడామణి దీక్షితుని కమలినీకల హంసము, వత్సరాజు రూపకషట్కము మొ. భాస్కరకవి ఉన్మత్తరాఘవము, కాంచనాచార్యుని ధనంజయ విజయము మొదలగునవి చిన్న రూపకములు. క్రీ.శ. 12వ శతాబ్ది తరువాత తెలుగు కవులనేకులు పెక్కు సంస్కృత రూపకములను రచించియున్నారు.

ఇంచుమించుగా పై రూపకములన్నియును ముద్రితములై లభ్యమగుచున్నవి; ఇంచుమించుగా అన్నియును ఆంధ్రీకృతములైనవి; ఒకే రూపకమును పలువురు అనువదించి యున్నారు కూడాను. ఉదా : 'అభిజ్ఞాన శాకుంతలము'ను నలువదిమందికి పైగా ఆంధ్రీకరించిరి.

అలంకారశాస్త్రములందు పెక్కు రూపకముల పేర్లు పేర్కొనబడుటయే కాక, కొన్నింటినుండి ఉదాహరణ శ్లోకములుకూడ ఉద్ధృతములై యున్నవి; కాని, అవి యేవియును లభింపలేదు.

(గత సంచిక తరువాయి)

# తెలుగు సాహిత్యంలో
# అస్తిత్వవాదం

- ఆర్.ఎస్. సుదర్శనం

1960లో భాస్కరభట్ల కృష్ణారావు అస్తిత్వవాద దృక్పథంతో నవల వ్రాసే ప్రయత్నంలో ''వెల్లువలో పూచికపుల్లలు'' వ్రాశారు. శీర్షికలోనే భాస్కరరావు ఈ దృక్పథాన్ని గూర్చి పడిన అపోహ ఏమిటో తెలుస్తుంది. వ్యక్తి వెల్లువలో పూచికపుల్ల కాదు, కాకూడదనే అస్తిత్వవాదం నొక్కి చెబుతోంది. వ్యక్తిలో బాధ్యత, నిజాయితీ, ఆత్మపరీక్ష అనేవి అతని జీవితంలో అస్తిత్వ దర్శనానికి, విశిష్టమైన విలువల సృష్టికి కీలకమైన గుణాలు. అవి లోపించిన వ్యక్తి వెల్లువలో పూచికపుల్లా, చరిత్రహీనుడూ అవుతాడు. ఈ నవలలో మధు సమస్య కూడా 'చివరకు మిగిలేది' లోని దయానిధి సమస్యే. తల్లి పతివ్రత కాకపోవడం. కాని మధు ఈ సత్యాన్ని ఎదుర్కొని అస్తిత్వాన్ని దర్శించే బదులు నిరీహుడై తన చేతలకు తాను బాధ్యత వహించడానికి నిరాకరిస్తాడు. ఫలితం ఏ విధంగా సమర్థనీయంకాని అతని నైతిక ప్రవర్తన, పాఠకుల సానుభూతిని పొందలేకపోతుంది. 1963లో పి.వి. సుబ్బారావు వ్రాసిన 'ఆమె చెప్పింది' అనే నవల కూడా అస్తిత్వ దృక్పథాన్ని ఉద్దేశించిన రచనే. ''యథార్థాన్ని మించిన నీతిగాని మానవత్వాన్ని మించిన పవిత్రతగాని ఏ యుగంలోనూ లేదనుకుంటాను. ఉంటే అది నీతికాదు, అది పవిత్రత కాదు. ఆ నీతి మేడిపండు. ఆ పవిత్రత దానిలోని పురుగులు మాత్రమే'' అన్న ముగింపు వాక్యాలతో తను నవలలో చిత్రించిన మృణాళిని అనే సినిమా తార యొక్క సంప్రదాయ విముక్తమైన జీవితాన్ని సమర్థించే ప్రయత్నం చేశారు. ఈ నవలలో మృణాళినీ రజనీకాంతుల సంబంధం సామాజిక వ్యవస్థ సూత్రాలకు అతీతమైన ఒక అనుబంధం. అసంభావ్యమేమీ కాదు. కాని రచయిత మృణాళిని వ్యక్తిత్వం ఎలా అస్తిత్వపు ప్రాథమిక విలువలను స్పృశించిందో చిత్రించలేకపోయారు. ఇది శిల్పంలో లోపం.

అస్తిత్వవాద దృక్పథం అభివ్యక్తం కావటానికి పాత్రచిత్రణలోగాని, సన్నివేశాల్లోగాని, ముగింపులో గాని ఎక్కడో ఒకచోట అస్తిత్వపు గాఢస్పర్శ, అనుభూతీ పాఠకునికి అందాలి. ఇది ముఖ్యం. 'అల్పజీవి', 'చివరకు మిగిలేది', 'మెరుపుల మరకలు' నవలల్లో ఈ లక్షణం ఉన్నది. 'వెల్లువలో పూచిక పుల్లలు', 'ఆమె చెప్పింది' నవలల్లో లేదు. వ్యవస్థతో వ్యక్తి ధర్మానికి జరిగే సంఘర్షణ ఒక్కటే కాదు ముఖ్యం. ఆ సంఘర్షణలో, ఆ వ్యక్తి వేసే ప్రతి అడుగులో, పోయే పోకడలో, గాఢమైన అనుభూతి, చిత్తశుద్ధి, ఆత్మపరీక్ష ద్యోతకమౌతూ అస్తిత్వ దర్శనం జరిగిన స్ఫూర్తి ఉండాలి. ఒక నవలలో అభివ్యక్తమయ్యే జీవితానికి వ్యవస్థాపరంగా, సిద్ధాంతపరంగా, సామాజికంగా, హేతుబద్ధంగా అర్థం లేకపోవచ్చు; అంతమాత్రాన అది అస్తిత్వవాద దృక్పథానికి అభివ్యక్తి కానేరదు. అస్తిత్వపు అనుభూతి రసధ్వనిగా అందడం ప్రధానం. అప్పుడే ఆ నవలకు ఆ పాత్రకు ప్రాణం వస్తుంది.

ఇంతవరకు వ్యవస్థతో సంఘర్షణపడి తద్వారా అస్తిత్వ దర్శనం పొందిన ప్రధాన పాత్రలుగల నవలల్ని పరామర్శించాను. ఇక్కడ వ్యక్తి తనతో తాను సమాధానపడటం ప్రధానమైన పర్యవసానం. అస్తిత్వవాద దృక్పథానికి యిదే మూసకాదు. వ్యక్తి వైశిష్ట్యం కారణంగా వ్యవస్థతో ఘర్షణపడటమే జీవితం కానక్కర లేదు. ఇంతవరకు పేర్కొన్న నవలల్లో జీవితమూ వ్యక్తిత్వమూ విడివిడిగా ఉంటూ ఒకదానితో ఒకటి ఎలా అనుసంధిస్తున్నాయో చిత్రించడం కనిపిస్తుంది. ఇది ఒక పద్ధతి. ఇదికాక మరో పద్ధతి వుంది. జీవితం, విలువలు, వ్యక్తి - మూడు వేరు వేరు విషయాలు కావు. జీవించడం నుంచీ విలువలూ,

వ్యక్తిత్వమూ సిద్ధిస్తాయి అనే అస్తిత్వవాద దృక్పథం నవల ఎత్తుగడలో, నడకలో, శిల్పంలోనే, ఆవిష్కృతం కావడం. ఈ రకం నవల ఒక విస్పష్టమైన వ్యక్తిత్వంతో ప్రారంభం కాదు. జీవితంతో ప్రారంభమౌతుంది. అంటే వ్యవస్థను అంగీకరించడంతోనే ప్రారంభమౌతుంది. అక్కడినుంచీ వ్యక్తిత్వమూ, కొత్త విలువలూ, జీవితంలోని వివిధ సంఘటనలు కారణంగా ప్రస్ఫుట మౌతూ వచ్చి, చివరకు జీవితంలో 'అస్తిత్వ'మే ప్రధానమైన విలువగా ధ్వనింపబడుతుంది. ఈ పద్ధతి నవలలు 'మళ్ళీ వసంతం' (ఆర్. ఎస్. సుదర్శనం) 1960, 'తాగుబోతు' (వి. నాగరాజు) 1963, 'మైనా' (శీలా వీర్రాజు) 1964.

'మళ్ళీ వసంతం' నవల ఊర్మిళ అనే పాత్ర తన జీవితాన్ని గూర్చి తాను చేసుకున్న పరామర్శ. నిశితమైన విశ్లేషణం. ఊర్మిళ తన జీవితంలో జరిగిన విశేషాలకూ తనతో సంబంధమున్న మనుష్యులకూ ఏ విలువనూ అర్థాన్నీ ఆపాదిస్తున్నదో ఆమె కథనం ద్వారానే మనం గుర్తించాలి. ఆమెకు వ్యవస్థతో సంఘర్షణలేదు. కాని వ్యవస్థ ఆమెను వంచిస్తూ వచ్చింది. గడచిన జీవితాన్ని ఆమె పరామర్శించడంలో, ఆమె కథనంలో, ఆలోచనా వైఖరిలో, ఆలోచించే గుణంలోనే ఆమె వ్యక్తిత్వం యొక్క ప్రత్యేకత మనకు గోచరమౌతుంది. ఎప్పటికప్పుడు ఆలోచిస్తూ గతాన్నీ ప్రకృతాన్నీ సమన్వయం చేసుకుంటూ వెళ్ళడం ఆమె ప్రవృత్తి. అందువల్ల నవలలో ఆమె జీవితానికి వ్యక్తిత్వానికీ తాదాత్మ్యం ఉన్నది. ఊర్మిళ కథనంలో ఇతర పాత్రలు కన్పించినా వాళ్ళు ఆమె మనశ్చిత్రాలే తప్ప వాళ్ళకు ప్రత్యేకమైన అస్తిత్వం లేదు. నవలద్వారా మనకు గోచరమయ్యేవి ఊర్మిళ అస్తిత్వమూ, ఆ అస్తిత్వపు విలువలూ. ఊర్మిళ తను సాధించినానని అనుకునే విలువల్ని మనం అంగీకరించవచ్చు, తిరస్కరించవచ్చు. కాని ఆమె జీవితంతో రాజీ కుదుర్చుకుంటుంది నవల చివర. ఆమెను గూర్చినతీర్పు పాఠకులకే మిగిలి ఉంటుంది!

'తాగుబోతు' నవల చైతన్యస్రవంతి మార్గంలో వ్రాయబడింది. ఇందులో ముసలివాడైన త్రాగుబోతు గత జీవిత స్మృతులే అతని జీవితాన్నీ, వ్యక్తిత్వాన్నీ అభివ్యక్తం చేస్తాయి. వాటి ధ్యానతోనే వాడు ప్రాణాలు విడుస్తాడు. ఆ ముసలివాడి జీవితం, వ్యక్తిత్వం అర్థశూన్యమనీ, మనకు తెలిపిన విశేషమైన విలువలు అందులో కనిపించవనీ అనుకోవచ్చు. కాని త్రాగుబోతు పాత్రచిత్రణ మనలో కలిగించే కళానుభూతిలోనే వాని అస్తిత్వపు ప్రాథమిక విలువ గోచరమౌతున్నది. అది అనుభూతికే తప్ప వ్యాఖ్యానానికి అందేదికాదు!

'మైనా'లో నాయకుడు సాయిబాబా, పోలీస్ కాన్‌స్టేబిల్. ఈ నవలలో కథ ఉన్నా, కథాసంవిధానం లేదు. అందుకు కారణం సాయిబాబా జీవితానికీ వ్యక్తిత్వానికీ రచయిత సాధించిన తాదాత్మ్యం. ఆ వ్యక్తిత్వం ఒక దృక్పథాన్నీ లేక కొన్ని విశ్వాసాలనూ ముందు పెట్టుకొని తన్మూలంగా నడిచి, లేక నడవలేక బాధపడిన వ్యక్తిత్వంకాదు. కాని సాయిబాబా జీవించిన జీవితాన్నిబట్టి చూస్తే అందులో ఒక సౌష్ఠవం, కొన్ని ముఖ్యమైన మలుపులూ గోచరమౌతాయి. అందునుంచి ఉత్పన్నమయ్యే విలువల్ని గూర్చి ఎవరికివారు వ్యాఖ్యానమూ చేసుకోవచ్చు.

ఈ నవలల్లో వ్యక్తి జీవితంతో రాజీపడటం, జీవితాన్ని అంగీకరించడం అనే పర్యవసానంద్వారా అస్తిత్వపు స్పృహ అనుభూతమౌతున్నది.

ఇంతవరకూ పేర్కొన్న రెండు పద్ధతులూకాక మూడో పద్ధతి ఉంది. నవలలో ఒక పాత్ర ద్వారా కాకుండా, యిద్దరు ముగ్గురు పాత్రల ద్వారా వారి మనస్తత్త్వాలకూ, అనుభూతికీ, సాదృశ్యంలో భిన్నత్వం సూచించడం ద్వారా, అస్తిత్వవాద దృక్పథాన్ని స్పష్టీకరించడం మూడో పద్ధతి. 'అసుర సంధ్య' (ఆర్. యస్. సుదర్శనం) 1965. 'హిమజ్వాల' (వడ్డెర చండీదాస్) 1974, ఈరకం నవలలు.

'అసుర సంధ్య'లో యిద్దరు పాత్రలున్నారు. నాగరాజు మొదటినుంచీ ఏ రకమైన వ్యవస్థను అంగీకరించడు. జీవితంతో తాదాత్మ్యం చెంది తద్వారా విలువల్ని సృష్టించే దృక్పథం అతనిలో మొదటినుంచీ ఉన్నది. శ్రీధర్ పాత్ర అందుకు భిన్నం. అతను ఏవో విలువల్నీ, ధర్మాల్నీ, ఆదర్శాల్నీ ముందుపెట్టుకొని అడుగులు వేయబోయి మాటిమాటికి తూలుతాడు. క్రమంగా జీవించడం నుంచే వ్యక్తిత్వమూ విలువలూ సిద్ధిస్తాయని గ్రహిస్తాడు. అలాగే చంద్రావతి, పద్మమణి పాత్రలూ భిన్నత్వం కలిగి ఈ దృక్పథ నిరూపణకే తోడ్పడుతవి. స్త్రీ పురుష పాత్రల సాదృశ్యంలో భిన్నత్వం ద్వారా ఈ నిరూపణ జరిగింది. 'హిమజ్వాల' నవలలో కృష్ణచైతన్య, గీత అస్తిత్వవాద దృక్పథాన్ని అభివ్యక్తం చేసే ముఖ్యపాత్రలు. వారికీ విజయసారథి, మాధురి పాత్రలకు ప్రవర్తనలో సాదృశ్యం కనిపించినా ఈ పాత్రల్లో అస్తిత్వపు ఆర్తీ, అన్వేషణా, కనీసం స్పృహా, లేకపోవడం అనే భిన్నత్వాన్ని నిరూపించడం ద్వారా ముఖ్యపాత్రల వైశిష్ట్యాన్ని స్పష్టం చేశారు రచయిత. కాని ఈ నవల ముగింపులో విశేషం, అస్తిత్వజిజ్ఞాసతో అన్వేషించిన గీత మరణిస్తుంది. కృష్ణ చైతన్యజీవితం మళ్ళీ ఒక మలుపు తిరుగుతుంది. అతని అన్వేషణలో మరో అధ్యాయం ప్రారంభమయ్యే సూచనతో నవల ముగుస్తుంది. జీవితానికి ముగింపులేదని ధ్వని.

అస్తిత్వవాద లక్షణాల్ని కొన్నింటిని ప్రతిఫలించిన మొదటి కథలు, నాకు తెలిసినంత వరకు, పాలగుమ్మి పద్మరాజు వ్రాసిన 'గాలివాన', 'పడవ ప్రయాణం'; విశ్వనాథశాస్త్రి 'కార్నర్ సీట్', 'నీడలు'. జీవిత గాంభీర్యాన్ని, అంటే ఎందుకు అనే ప్రశ్నకి లొంగని, వివరణకూ విశ్లేషణకూ అతీతమైన అస్తిత్వపు తాలూకు రహస్యాన్ని హృదయస్పందిగా ఆవిష్కరించే రసధ్వని యీ కథల్లో ఉన్నది.

1965లో నేను వ్రాసిన 'ఏకాంతం' అనే చిన్న కథను ఉదాహరిస్తాను. ఆనందరావు ఆరోగ్యం దృష్ట్యా సిగరెట్ మానెయ్యాలని డాక్టరు సలహా. మానెయ్యాలని ప్రయత్నించి విఫలుడై, ఎందుకు విఫలుడౌతున్నాడో జిజ్ఞాసచేస్తూ జీవితాన్ని తిరగవేస్తాడు. కథ ముగింపు : ''సిగరెట్ కాలుస్తూండగా ఆనందరావుకు అర్థం స్ఫురించింది. హేతువాదం దృష్ట్యా, ఆరోగ్యసూత్రాల దృష్ట్యా, కుటుంబ బాధ్యత దృష్ట్యా వదలిపెట్టవలసిన సిగరెట్‌ని తను ఎందుకు వదలిపెట్టలేకుండా ఉన్నాడో అర్థం తెలిసి వచ్చింది. చీకటిలో మెరుస్తూ తన ఊపిరితోపాటు స్పందించే సిగరెట్ కొన, ఈ నిప్పుకలిక, వికసించి ముకుళించే యీ ఎర్ర గులాబిమొగ్గ, ఇది తన ఏకాంతం, తనలోని తన స్వరూపం. జీవితానుభవాలు అనే పూసలికి అర్థాన్నీ ఆకారాన్నీ కల్పిస్తున్న అంతస్సూత్రం ఏకాంతం. సిగరెట్ కాలుతూనే ఉంది''. అస్తిత్వపు అనుభూతి ఎప్పుడు దేనిలో ఎలా వస్తుందో చెప్పడం అసాధ్యం. అది కలిగినప్పుడు లభించే విముక్తి స్వేచ్ఛ, జీవితం మీద కొత్తదృష్టి, దాన్ని నిరూపిస్తాయే తప్ప, దాన్ని యిదమిత్థమని ఉపాధులద్వారా వివరణద్వారా నిర్వచించడానికి వీల్లేదు.

'త్రిపుర' వ్రాసిన 'వంతెనలు' అనే కథలో అస్తిత్వపు తాలూకు తీవ్రమైన పరివేదన (Existential despair) చిత్రించబడింది. జీవితం అర్థంలేని కొన్ని సంఘటనల కూర్పు. ఆత్మాన్వేషణలో మనిషి బయలు దేరినచోటికే తిరిగివస్తాడు. తన్ను తాను వెదుక్కోవడంలో అనుభూతుల మధ్య, ఆలోచనల మధ్య వంతెనలు కేవలం బుద్ధికల్పన. అవి చాలవు. చివరకు మిగిలేది ఏదో స్ఫురణ, కథానాయకుని మనఃస్థితిని మొదటా చివరా అతని టేబిల్ డ్రాయర్‌లో ఉన్న రివాల్వర్, గార్డినాల్ మాత్రలు సూచిస్తాయి.

నేను వ్రాసిన 'మధురమీనాక్షి' అనే కథ వేదాంతపరమైన అస్తిత్వ వాదానికి ఉదాహరణ. 'క్రైస్తవ పరమైన అస్తిత్వవాదం' (కర్క్‌గార్డ్, పాల్ టిల్లిచ్) ఒక దృక్పథం ఉన్నట్లే. ఈ కథలోని దృక్పథాన్ని 'వేదాంత పరమైన అస్తిత్వవాదం' అనవచ్చును. సంప్రదాయంలో పరాశక్తిమాతృమూర్తి. ఇది ఒక ప్రతీక. ఒక దార్శనికమైన నిర్దేశం. భగవత్తత్త్వానికి లింగభేదం లేదు, వావీవరుసా లేదు. ఈ కథలో మీనాక్షి

ప్రియురాలిగా కథానాయకునికి అద్వైతానుభూతి ప్రసాదిస్తుంది. ఈ అనుభవం శారీరకంగా కనిపించినా పారలౌకికమైనది. కథలో దానికి తగిన ఉపపత్తి చేకూర్చబడింది. సంప్రదాయవాదులకు మీనాక్షిదేవి ప్రియురాలు కావడం 'షాకింగ్'గా ఉండవచ్చు. ఇక్కడే అస్తిత్వవాద దృక్పథం వేదాంతపరంగా అభివ్యక్తమౌతుంది. ఈ సందర్భంలో ఒక ఐతిహ్యాన్ని ప్రస్తావిస్తాను. నా కథను ప్రభావితం చేసిన ఐతిహ్యం అదే. ధూర్జటి శృంగార ప్రియుడు. అంతకంటె శివభక్తుడు. ఇందులో అసంగతమేమీ లేదు. అస్తిత్వవాది అసంగతం ఉండదని గ్రహించగలడు. ధూర్జటి శివరాత్రి నాడు వేశ్యపర్యంకం మీద ఉండి, వేశ్య స్తనాన్ని శివలింగంగా అర్చిస్తాడు. శ్రీ నోరి నరసింహశాస్త్రి వ్రాసిన 'ధూర్జటి' నవలలో, ధూర్జటి యొక్క ఈ చర్యను శివభక్తి స్ఫోరకమైనా అపచారంగానే చిత్రించి దానికి శిక్షగా, ధూర్జటి రాజు దగ్గర అవమానం పొందినట్టు చిత్రణ జరిగింది. అస్తిత్వవాది అవగాహనలో ధూర్జటి పాత్రపోషణ మరోవిధంగా ఉంటుం దని వేరుగా చెప్ప నక్కరలేదు. వేదాంతంలో భగవల్లీల, భగవన్మాయ అనే దానికి సంప్రదాయం సరిహద్దుకాదు. దానికి సరిహద్దులు లేవు. వ్యక్తివైశిష్ట్యాన్ని బట్టి ఆ లీల అనుభూతం అవుతూ ఉంటుంది. ఇదే 'మధుర మీనాక్షి' కథ ధ్వనిస్తుంది.

1973లో 'ఎరుపు' అనే కథ ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ప్రచురితమైంది. ఈ కథలోని సారథి బు[illegible] కథలో తాత్త్విక, నైతిక, సామాజిక, రాజకీయ సిద్ధాంతాలతో జీవితంలోని అనుభూతికీ, ఘటనకీ (chance) భాష్యం చెప్పుకోడానికి వీలుకాని స్థితి ఎదురౌతుంది సారథికి. సారథి క్షయరోగి. వ్యాధి ఉద్ధృతంగా ఉన్న కాలంలో అతని ప్రవృత్తికీ, అది తగ్గినట్లు తెలియగానే అతని ప్రవృత్తికీ ఎంతో తేడా కనిపిస్తుంది. అతణ్ణి ఆకర్షించిన రాజ్యలక్ష్మి అతని జీవితాన్ని అనుభూతి వైశిష్ట్యంతో మార్చివేస్తుంది. వ్యాధి తిరగబెడుతుంది. అతనికే తెలీని అస్తిత్వపు లోతుల్నుంచీ వచ్చిన ఉద్వేగంతో ఆమెను హత్యచేస్తాడు. 'మృత్యోర్మా అమృతం గమయ' అనే వాక్యంలోని వ్యంగ్యంతో కథ ముగుస్తుంది. బుద్ధిజీవికి జీవితంతో వ్యవహరించడం తెలీదు. అతను జీవితాన్ని హత్య చేస్తాడు.

ఇక్కడ ఉదాహరణప్రాయంగానే కొన్ని కథల్ని ప్రస్తావించాను. అన్నింటినీ అందరు రచయితల్నీ పేర్కొనడం సాధ్యంకాదు.

తెలుగు కవిత్వంలో అస్తిత్వవాదం ఎక్కడైనా కనిపిస్తుందా? 1965లో కనిపించి అనతికాలంలోనే మాయమైంది. దిగంబర కవుల మొదటి సంపుటి అస్తిత్వవాద దృక్పథాన్ని ధ్యేయంగా పెట్టుకునే అవతరించింది. రెండవ సంపుటి నాటికి ఆ ధ్యేయం మారిపోయింది. ''ఈ దేశంలో ఈ గోళంలో ఊపిరిపీల్చే ప్రతి మనిషికోసం తపనపడి, అతని భావికోసం వెక్కి వెక్కి ఏడ్చి, పిచ్చెత్తి ప్రవచించిన కవిత .... నువ్వు లేవు. నీ అధికారం లేదు. నీ హోదా లేదు. నీ పంచ జరీఅంచు లేదు .... దేన్నీ నమ్మకు. నీ లోపల, ఈ ముసుగులోపల, యీ వంచన అంచుల కింద ఉన్న నీ అసలు స్వరూపాన్నీ, నీ 'తనాన్ని' నమ్ముకో .... ఒక్కటే గుర్తుంచుకో .... ఇన్ని వేల ముసుగు ముఖాలమధ్య ఊపిరి సలపనీని బతుకు పోరాటం మధ్య నువ్వెప్పుడూ ఏకాకివి. జనన మరణ యాతనల మధ్య పోరుసల్పే సైనికుడివి .... ప్రతిమనిషిలోనూ అతని అసలు స్వరూపం దీపంలా వెలుగుతూ ఉంటుంది .... నీ నిజ స్వరూపంతో యీ ప్రపంచాన్ని పాలించుకో.'' ఇలా అస్తిత్వవాద దృక్పథాన్ని ప్రబోధించారు మొదటి సంపుటిలో. రెండవ సంపుటి నాటికి 'వ్యక్తి' కాదు, 'వ్యవస్థ' ధ్యేయం అన్నారు. ''నేటి చైతన్యవ్యవస్థని మూలంగా తొలగించి నిత్యనూతన మహత్తర వ్యవస్థకోసం తపనపడుతున్న దిగంబర కవులం'' అన్నారు. అస్తిత్వవాదం సమాజ పరిణామం విషయంలో తాటస్థ్యం వహిస్తుందన్న సామాజికవా దుల విమర్శకు లొంగి, వీళ్ళు దిగంబరవాదాన్ని అంటే అస్తిత్వవాదాన్ని వదలుకొని, మార్క్సిస్టుల య్యారు. ''ఈ జీవితం తాటస్థ్యాన్ని వరించకూడదు. మనిషిజీవితం ద్వీపంలా కాకుండా తోటివారి

ప్రేరణా స్రోతస్సుగా ఉండటం కావాలి'' అన్నారు. కాని సామాజిక నియంతృత్వంలో వ్యక్తికి ప్రాధాన్యం ఉండదనీ, వ్యక్తి నలిగిపోతాడనే గ్రహింపుతో ''మనిషిని కీలుబొమ్మగా, యంత్రపు విడిభాగంగా తయారు చేసే నియంతృత్వానికి అది (మార్క్సిజమ్) మార్గంకారాదు'' అని కూడా అన్నారు. అస్తిత్వవాదానికీ, మార్క్సిజానికీ లంకె ఎక్కడో, అసలు సాధ్యమో కాదో, ఆలోచించే ఓపిక, జిజ్ఞాస, వీళ్ళకు లేకపోయింది. తర్వాత వీళ్ళు విప్లవ కవిత్వపు కాల్పనికతలోకి జారి పోయారు. రాజకీయాలు వీళ్ళని కబళించి వేశాయి. మొదటి సంపుటిలోని ఖండికలన్నీ ఒక స్థాయి కవిత్వం కాదు. వాటిలో అస్తిత్వ దృక్పథం స్వరూపం దిద్దుకున్న ఖండికలు తక్కువే ఉన్నాయి.

'గ్లానిర్భవతి భారత' అనే ఖండికలో మహాస్వప్న -
''మానవత మసిపాతలా మారిపోయినప్పుడు
మాసిపోయినప్పుడు
నేను వస్తున్నాను దిగంబర కవిని
స్తంభించిన కవితాస్తంభం బద్దలై పుట్టుకొస్తున్న ఉగ్రనగ్న నరకేసరిని
నా చేసిన చెట్లని నడిపించేందుకు
పాతేసిన గాళ్ళని పరికించేందుకు
వికృతాకారపు శిలల్ని మానవులుగా మలిచేందుకు
మరణించిన భగవంతునికి ప్రాణం పోసేందుకు
నేను వస్తున్నాను దిగంబర కవిని - వాచవిని
రాత్రి ఉదయిస్తున్న ప్రతిభా రవిని''

ఇది అస్తిత్వవాద దృక్పథాన్ని గురించిన మేనిఫెస్టో కవిత. మన కవుల్లో చాలమందికి ఏ దృక్పథమైనా సరే ఆ దృక్పథాన్ని కవిత పేర వాచ్యంగా యథాతథంగా నినాదాలుగా వ్రాయడమే తెలుసుకాని, ఆ దృక్పథాన్ని అనుభూతిపరంగా, ధ్వనిపూర్వకంగా సృష్టించటం, రూపొందించడం తెలీదు. దిగంబరక వుల మొదటి సంపుటిలోనూ యిటువంటి మేనిఫెస్టో కవిత ఎక్కువ. కాని ఒకటిరెండు ఖండికల్లో మంచి ప్రయత్నం కనిపిస్తుంది. భైరవయ్య 'హురే-హురే', నగ్నముని 'జైల్లో సముద్రం' అటువంటివి. జైల్లో సముద్రం యిలా ప్రారంభమౌతుంది.

''సూర్యుని కడ్డంగా నుంచున్న
ఆ మబ్బుతునక పేరేమిటి?''

ఇది అస్తిత్వపు అనుభూతిని అచ్ఛాదించే హేతువును గూర్చిన జిజ్ఞాస.

''అర్థంకాని అనంతశూన్యం అంచుమీదకి
ఆకారంలేని కుర్చీ నొకటి లాక్కుని
అర్థవంతమైన బ్రతుకు వెన్నెల చుక్కల్ని కప్పులో నొంపి
ఒక్కొక్క క్షణం పెదవులకానించి
విషాదాన్ని ఆరాధిస్తూ వుంటానా
హోయలు హోయలుగా పొగలు పొగలుగా
కెరట కెరటాలుగా కాలం
నా కాళ్ళని ముంచెత్తుతూ వుంటుందా
ఎందుకో ఒక్కసారి ఏకాంతంలోకి
నిర్జనారణ్యాలు నడిచివస్తాయి.
నిబిడాంధకార గహ్వరాలు తెరుచుకుంటాయి....''

ఇలా నడుస్తుందీ పద్యం: అహంత ఒక కుర్చీ - చేతనలో ఊహలూ ఆలోచనలూ కాలగమనం - ఏకాంతంలో అవ్యక్తచేతనంలోనుంచీ వచ్చే అర్థంకాని భయాలు - ఏకాంతంలో భయవిహ్వలతరూపం 'సిగరెట్టు చివర' - విడివిడి జ్ఞాపకాలు ముసురుకుంటాయి. కాని అనుభూతిని గూర్చిన జిజ్ఞాస అలానే మిగిలిపోతుంది. 'అర్థంకోసం' అంటే ఆత్మదర్శనం కోసం అన్వేషణ. 'మనను మసీదు', 'మహిషం వేదం వల్లె వేయడం' మతవ్యవస్థల్ని చావుపుట్టుకల్ని ధ్వనిస్తాయి. 'మహాబోధి' 'నీరో' బౌద్ధనాగరకతనూ, రోమన్ నాగరకతనూ సూచిస్తాయి. 'నగరం అస్థిపంజరం' వర్తమాన కాలపు నాగరక జీవనపు శూన్యాన్ని తెలుపుతుంది. జైల్లో 'బంధింపబడిన సముద్రం' అరికట్టబడిన స్వేచ్ఛ. 'కూలుతున్న పిరమిడ్లు' ప్రాచీన వ్యవస్థా శైథిల్యం. 'రోదసీ ప్రయాణాలు' వైజ్ఞానిక విప్లవం చూపే ప్రగతి. 'శిశు గర్భంలో అణుకోర దిగింది' ఆ ప్రగతికి పరాకాష్ఠ. ఇంత పరామర్శ తర్వాత ప్రశ్న ప్రశ్నగానే మిగిలింది. ''ఏది అర్థం? పరమార్థం?'' 'నీకూ నాకూ నడుమ, నాకూ యీ నటనకీ నడుమ, ప్రపంచ దేశాల ప్రళయ పరాచికాల నడుమ, సత్యానికి సత్యానికీ నడుమ, నిలుచున్న ఆ మబ్బు తునక పేరేమిటి?'' అనే ప్రశ్నతోనే పద్య ముగుస్తుంది. 'హి హి హీ నీపేరు ఈగ' అన్నట్లే ఆ మబ్బుతునక పేరు 'మేధ' అని సమాధానం మనం చెప్పుకోవచ్చును.

అస్తిత్వవాదం మేధావిన్యానంచే కప్పబడిన అస్తిత్వపు అనుభూతినీ, దానినుంచి రూపం దిద్దుకునే వైయక్తిక వైవిధ్యాన్నీ, వైశిష్ట్యాన్నీ ప్రాథమికమైన విలువలుగా ఎత్తిచూపుతుంది. మనిషిని జడవస్తువుగానో, యంత్రంగానో, ప్రకృతిలో, సమాజంలో, ఒక ప్రయోజనానికి సాధనంగానో, ఉపలక్షించే దృక్పథాన్ని వ్యతిరేకిస్తుందీ దృక్పథం. సామూహిక మైన నినాదాలతో, ఒత్తిడులతో మనిషిలోని సృజనాత్మక శక్తిని, నవ నవోన్మేషిత్వాన్ని అంతమొందింప జూచే ధోరణులను ప్రతిఘటిస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థగానీ, శ్రామిక వ్యవస్థగానీ, మరే వ్యవస్థగానీ - వ్యవస్థతో వ్యక్తికి సంభవించే ప్రతి సంఘర్షణలోనూ వ్యక్తినే సమర్థిస్తుంది. అందుకే యిది సామాజికమైన అభ్యుదయానికి తోడ్పడదనీ, తాటస్థ్యం వహిస్తుందనీ విమర్శ. సామాజికమైన అభ్యుదయాన్ని ఒక చట్రంలా ఊహించినప్పుడు, మానవుని సృజనాత్మకత దానిలో యిమిడేందుకు నిరాకరించకపోవడంలో ఆశ్చర్యం ఏమీలేదు! సమాజానికీ వ్యక్తికీ మధ్య యిచ్చి పుచ్చుకోవడమనే సంబంధాన్ని గుర్తించినప్పుడు రెండింటికీ ప్రాధాన్యం ఉందనీ, వ్యక్తివినాశం సమాజ స్తబ్ధతకూ, వినాశానికీ దారి తీస్తుందనీ అంగీకరించక తప్పదు. మరొక్క విషయం గమనించాలి. సమాజ ప్రగతిని నిరోధించని, దాని జోలికిపోని అనుభూతిలోకం వ్యక్తిలో ఎంతో మేర ఉన్నది. రాజకీయ, సామాజిక వ్యవస్థ అనవసరంగా దానితో కల్పించుకొని, దాన్ని నియంత్రించి, శాసించే పనికి పూనుకోక పోతే చాలు! మనిషిలో సృజనాత్మకత నశిస్తే, మనిషి వ్యక్తిగానూ సామూహికంగానూ కూడా మరణిస్తాడు! మనిషి చావకూడదు! ★

పునర్ముద్రణ

## Among the Believers

BELIEF in the paranormal or in psychic "mysteries" is widespread on both sides of the North-South divide. That it should be so deep-rooted in societies with flourishing scientific and sceptical traditions sometimes puzzles rationalists. More surprising, large numbers of people in the West report paranormal experiences (as opposed to merely believing in them). A 1992 survey by the Roper Organisation, for instance, shows two per cent of the US population or one in every 50 adult Americans, exhibiting symptoms that "sometimes mask a UFO abduction experience". A Gallup poll conducted in 1990 also revealed that one in every four Americans believed they had a telepathic experience and one in six Americans believed that they had been in touch with someone who had died. An earlier survey done at the University of Chicago showed that 67 per cent of Americans claimed ESP or extra-sensory perception and 31 per cent claimed clairvoyance. But as many experts caution, the belief alone is not evidence nor is it a substitute for facts.

## అవినీతే రాజనీతిగా మారింది

# సమకాలీన సమాజం-మారుతున్న విలువలు

- శివలింగం

విలువలు ప్రవర్తనా నియమావళికి సంబంధించినవి; లక్ష్యసాధనకు, ఆశయసిద్ధికి ఎన్నుకున్న మార్గదర్శక సూత్రాలు. విలువలను నాలుగురకాలుగా చెప్పవచ్చు. 1. మూలనైతిక విలువలు, 2. ప్రవర్తన నియామలు, 3. సాంస్కృతిక సంప్రదాయాభివృద్ధిలో మానవవ్యక్తిత్వ ఆదర్శ విధానాలు, 4. లక్ష్యసాధనకు, ఆశయ సిద్ధికి, కళ, సాహిత్య, తత్త్వశాస్త్ర, ఉన్నతజీవన విధానరీతులు. సత్యం పలకాలి. అబద్ధం ఆడరాదు. దొంగతనం చేయరాదు వంటివి మౌలిక నైతికసూత్రాలు. సామాజిక అస్తిత్వంకోసం ఏర్పరచుకున్నవి. ప్రవర్తన సూత్రాల్లో పూర్వం వర్ణాశ్రమ విధానంవుంది. ఎవరి వృత్తి వారేచేయాలి. ఆధునిక సమాజంలో బ్రాహ్మణ క్షత్రియులు లేరు. ఉపాధ్యాయులు, శాస్త్రవేత్తలు, సైనికులు వున్నారు. ఎవరి ధర్మాన్ని వాళ్లు నిర్వర్తించాలి. మంచివాడుకావచ్చు. చెడ్డవాడు కావచ్చు. నైతిక దృష్ట్యా పరిశీలించాలి. సద్గుణాలే నైతికత.

సమాజంలో ఆదర్శపురుషులు వుంటారు. స్థితప్రజ్ఞుడు, కన్ఫ్యూషియస్, బోధిసత్వుడు, క్రీస్తులాంటి మహానుభావులు. భారతీయ సంప్రదాయంలో రాముడు, జనకుడు, యుధిష్ఠరుడు, సీత, ద్రౌపది, బుద్ధుడు, జ్ఞానేశ్వరుడు, తుకారాములు ఆదర్శమానవులు. ప్రజల మనస్సుల్లో సజీవంగా వుంటారు. కళాసాహిత్యాలు, శాస్త్రాలు సమాజ సంప్రదాయాన్ని కాపాడతాయి. అయితే ఏ సమాజమైనా సంప్రదాయంలోని మేలిమిని స్వీకరిస్తుంది. విలువల్ని విధ్వంసం చేయదు సాహిత్యం. నైతికత వైయక్తికం. సమాజంలో విలువల పతనానికి కారణం నైతికతను వదలి విశృంఖలంగా ప్రవర్తించడం. సామాజిక పాత్రను నైతికతతో నిర్వహిస్తే సమాజంలో విలువల సంక్షోభం వుండదు. భౌతిక జీవనానికి ప్రాధాన్యతనిస్తే విలువలుండవు. సమాజానికి దూరంగావుండి అంతర్ముఖుడై నైతికతను కాపాడుతున్నాడంటే ప్రయోజనం శూన్యం. రెండూ సమ్మేళనం పొందినపుడే సమగ్రత. తాను జీవించి, ఇతరులను జీవించనీయడం మానవతాలక్షణం. సర్వమానవ సౌభ్రాతృత్వం, సర్వభూతదయ మానవునికి వుండాలి. మారుతున్న సమాజంలో విలువలు మారుతుంటాయి. మౌలిక విలువలు మారవు. సంకుచితమైన కులమత సరిహద్దులను చెరిపేసినపుడు సహజీవనం చేయగలడు మానవుడు. జీవనానికి కలిసిమెలిసి వుండటానికి నైతికతను మూలంగా తీసుకుంటే ఆధునిక సమాజంలో వ్యక్తి జీవితమూ, సంఘ జీవనమూ సౌష్ఠవంగా వుంటుందనడంలో సందేహం లేదు.

సమాజంలో విలువలు దిగజారుతున్నవని చెప్పడం వింటూవుంటూము. అన్నిరంగాల్లోనూ అంటే రాజకీయం, మతం, మానవత్వం, ఆర్థిక విషయాలలో నైతిక విలువలకు తిలోదకాలిస్తున్నారు. నీతిని వొదిలితేనే రాజనీతి అంటున్నారు. అయితే మారుతున్న సమాజంలో విలువలుకూడా మారుతుంటాయి. విలువలు సంప్రదాయ సమాజంలో వున్నవే ఆధునిక సమాజానికి సరిపోతాయా అనేది ప్రశ్న.

మతం మత్తుమందులాంటిదని మార్క్స్ అన్నమాటే విలువలకూ వర్తించవచ్చు. విలువలు సంప్రదాయ దృష్టిలో స్థితిశీలాలు. ఆధునిక దృష్టిలో గతిశీలాలు. నిలబడి నీళ్లుతాగడం ఒక విలువ అనుకుంటే కలబడందే నీళ్లు దొరకవు. పరుగెత్తందే పాలూ దొరకవు అంటున్నారు. అలాంటప్పుడు విలువకు విలువలేదు. జీవన వేగంలో విలువ ఒక పలాయనవాదం అయింది. బ్రతుకు పందెంలో విజయంకోసం అందని ద్రాక్షకోసం పరుగులెత్తడం విలువ అయింది. వ్యక్తులుగాని సమూహంగాని వారికోసం విలువలు ఏర్పరచుకోవడం అవసరం. జీవితం రాజకీయమయమైపోయింది. వ్యాపార మనస్తత్వం పెరిగింది. పాతకాలపు విలువలు తొలగిపోయాయి. అధికారం, ధనం - ఈ రెండూ శిఖరస్థానం వహించాయి. ఈ రెంటి సమగ్రతకోసం సంబంధిత విలువ చాలా అవసరం. విలువ పరాయీకరణ ఏజెంటు కాదు, వాస్తవిక జీవిత ఆశయసిద్ధిగా అవుతుంది. విలువ ముగ్గురికి సంబంధించింది. నేను-అతడు-అందరూ. వ్యక్తి స్వార్థం కోసం చూస్తాడు. అయినా ఇతరులతో సాంఘిక కట్టుబాటువల్ల సమాజంలో కలసివుంటాడు. అందరూ ఒకరితో ఒకరికి మొత్తం పరిసరాలతో సంబంధం వుంటుంది. వైయక్తికమైన అధికార, ఆదాయ అన్వేషణను అవగాహన చేసుకోవాలి. వైయక్తికం, సమాజం, పరిసరాలు-ఈ మూడింటి సంబంధం సమతౌల్యం కలిగివున్నప్పుడే విలువ గౌరవించబడుతుంది. విలువకు మూలంకూడా అదే. పరస్పర సహకారాన్ని పెంపొందించడానికి అధికారం దోహదకారి కావాలి. ఆదాయం (porofit) కూడా దురాశతో దోపిడీ విధానంగా, నికృష్ట స్థాయికి దిగజారకూడదు. Value free సొసైటీ నీటి బుడగ. సకల విలువలనూ నిరాకరించడంవల్లనే భారతదేశంలో చార్వాకం నశించింది. చార్వాకులు మొత్తం విలువల వ్యవస్థనే నిరాకరించే దృష్టినే అలవరచుకొన్నారని రవిచంద్ అన్నారు. సమాజంలో విలువలకు ప్రాధాన్యతవుంది. సమాజం ఉన్నత విలువలను కాపాడగలిగితే సామాజిక జీవనం ఉన్నతంగా వుంటుంది. విలువలకు తిలోదకాలిచ్చి ధనసాధనే ఆనందసాధన అనుకుంటే ఎవరెంత ఎక్కువ మోసంచేస్తే అంతగా ధనికుడవుతున్నాడు.

**రాజకీయాలు :** భారతదేశాన్ని 21వ శతాబ్దంలోకి జాంబవంతుని అంగలతో తీసుకెళ్ళాలని ఉవ్విళ్ళూరాడు రాజీవ్‌గాంధి. ఆధునీకరణ పేరుతో కోట్లాదిరూపాయలు చేతులు మారాయి. బడాపారిశ్రామిక వేత్తలు బాగుపడ్డారు. పేదలకు ఉపయోగపడలేదు. ప్రభుత్వం ఒక సంస్థకు సహాయం అందిస్తుంది. ఆ సహాయంవలన వ్యక్తి లేక సంఘం బాగుపడుతుందా? లేదా అనేది పట్టించుకోదు. వ్యక్తికి నేరుగా సహాయం అందదు. ఆశయం నెరవేరకుండానే రాజీవ్‌గాంధీ వెళ్ళిపోయాడు. 1984లో అందమైన నినాదాలతో ఇందిరాగాంధీ పోయింది.

దేశంలో ఆర్థికవ్యవస్థ అవినీతి రాజకీయవేత్తలను, అవినీతి వ్యాపారస్తులను, అవినీతి ఉద్యోగుల్ని పెంచింది. దేశాన్ని దోచుకుని కుబేరులయ్యారు ఒకకొత్త ధనికవర్గం. పేద, మధ్య తరగతి వర్గాలనుంచి పెద్ద మొత్తాలు చేతులు మారాయి. పేదవర్గం పెరిగింది. అభివృద్ధి కార్యక్రమాలు తలక్రిందులైనాయి. భగవంతుణ్ణి ఆశ్రయిస్తే కష్టాలు తొలగి శుభం జరుగుతుందని ఆశించినట్లుగా పరిశ్రమలు, బ్యాంకుల జాతీయకరణ దారిద్ర్యాన్ని నిర్మూలిస్తుందని, అసమానతలు తొలగుతాయని భ్రమించారు. అదే సోషలిజం అనుకున్నారు. విశ్వవిద్యాలయాలు తీవ్రవాదుల్ని తయారుచేస్తున్నాయి. అద్వైత సిద్ధాంతంతోపాటు, అస్పృశ్యతను ఇంకా నిర్మూలించుకోలేదు. విద్య పునాదులే బీటలువారి, సంస్కృతి విచ్ఛిన్నమయింది. హిందువుల్లో కులమూ, మతమూ, ముస్లింల్లో వేర్పాటువాదం బలపడుతున్నాయి. హిందూ పునరుద్ధరణ వాదానికి, వ్యక్తి నిరాశాపూరిత హింసావాదం పునాదులేర్పరచింది వ్యవస్థ. దేశంలో పరిస్థితులు పూర్తిగా చెడూకాదు. అంతా మంచీ కాదు.

భారతదేశంలో ప్రజాస్వామ్యం బ్రతికేవుంది. ఒక్కసారి మాత్రం ఎమర్జెన్సీపెట్టారు. (1975 జూన్ నుండి 1977 మార్చి వరకు). రాజ్యాంగాన్ని, ప్రాథమిక హక్కుల్ని రద్దుచేశారు. పట్టణాలు విపరీతంగా పెరిగాయి. విద్యుత్ కోత, మురికివాడలు, రోడ్డంతా గతుకులు, పంపునీళ్లు, బందులు పెద్ద నగరాలకు తప్పడంలేదు. పబ్లిక్ రంగం పూర్తిగా విఫలమయినాక ప్రైవేటు రంగానికి ద్వారాలు తెరిచారు. స్టాక్ మార్కెట్ వ్యాపారస్తులు గణనీయంగా పెరిగారు. ఇన్‌ఫ్లేషన్ ఇంతకుముందుకన్నా పెరిగినా సంక్షోభంలో మాత్రం లేదు. శాస్త్ర సాంకేతిక రంగాల్లో అభివృద్ధిని సాధించినా, న్యూక్లియర్ బాంబును ఇంకా తయారు చేసుకోలేదు. అపారమైన సైనిక శక్తివుంది. ఉపగ్రహాలు, రాకెట్లు పంపుతూనే వున్నారు. ఇది అభివృద్ధి. దేశ జనాభా 85 కోట్లు. ప్రతి సంవత్సరం 2 శాతం పెరుగుదల. ప్రపంచజనాభాలో 15 శాతం ఇండియాలో వుంది. ప్రభుత్వ లెక్కల ప్రకారం 37 శాతం ప్రజలు దారిద్ర్యరేఖ దిగువవున్నారు. 75 శాతం ప్రజలు గ్రామాల్లో వున్నారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, విద్యుత్ సౌకర్యం, నీటి సౌకర్యంలేని గ్రామాలు యింకావున్నాయి. 80 లక్షలమంది ఆదాయం పన్ను చెల్లిస్తున్నారు. ఇళ్ళకొరత తీరలేదు. కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, మద్రాసువంటి నగరాల్లో 3 వంతుల ప్రజలు మురికి వాడల్లో నివాసం. నేషనల్ బిల్డింగు ఆర్గనైజేషన్‌వారి లెక్కల ప్రకారం 25 మిలియన్ల యూనిట్లు యిళ్ళు కట్టించాల్సివుంది. అంధులు, కుష్టువ్యాధి పీడితులు, పోలియోవ్యాధితో వికలాంగులు, క్షయరోగులు గణనీయంగా పెరుగుతూనే వున్నారు. ఇది బలహీనస్థితి. వెనుకబడినతనంనుంచి, దోపిడీ చేయబడిన స్థితినుండి స్వయంసమృద్ధి కోసం, స్వయం పోషకత్వంకోసం కృషిచేస్తున్న దేశం మనది.

మూడో ప్రపంచపుదేశాల్లో భారతదేశంలోనే ప్రజాస్వామ్యం జీవించివుంది. నెహ్రూ, గాంధీ యుగాలు అంతరించాయి. కళ, సినిమా, సాహిత్య, రాజకీయాల్లో, రేప్, మర్డర్, హింస, సెక్స్, క్షుద్రతాంత్రికత, రాక్షసనృత్యం చేస్తున్నాయి. ధనానికిచ్చిన విలువ మానానికివ్వడం లేదు. రాజకీయాలు కులమతాలుగా విడిపోతున్నాయి. కులసంఘా లేర్పడ్డాయి. గ్రామాలనుంచి ప్రజలు నగరాలకు వలసపోతున్నారు. 70 లక్షల మంది వెళుతున్నారు ప్రతి సంవత్సరం. నగర సంస్కృతి గ్రామీణ విలువల్ని హరించింది. దారిద్ర్యం, వెట్టిచాకిరి, మూఢ సంప్రదాయాలు, దోపిడీవిధానం గ్రామాల్లో కనిపించేవి. విద్యావంతులు పెరిగారు. అధికారం చేతులు మారింది; భూస్వాముల నుండి పేద, మధ్యతరగతి ప్రజలకు వచ్చింది. నగరాలు హింసకు, దోపిడీకి నిలయాలు. మానవ విలువలు నశించిపోతున్న క్రూరారణ్యం నగరం.

1960 హరితవిప్లవం తరవాత భూసంస్కరణలు ప్రవేశపెట్టారు. ప్రజలకు మిగులు భూముల పంపకం జరగలేదు. ఇంకా భూమిలేని ప్రజలు 80 మిలియన్లు, ఎక్కువమంది రోజువారీ కూలీలు, శ్రేయోరాజ్యం కోసం కన్న కలలు కల్లలైనాయి. ధనిక, పేద అసమానతలు పెరుగుతున్నాయి. హరిజనవాడలు నిలిచేవున్నాయి. కులవ్యవస్థ మరింత బలపడింది. రాజ్యాంగంగాని, సోషలిస్టు రాజ్యంగాని ఏమీ చేయలేకపోతున్నాయి. అగ్రవర్ణాలచే మిగతా కులాలవారి అణచివేత యథేచ్ఛగా సాగుతూనే వుంది. రాజ్యాంగం అస్పృశ్యుల రక్షణకు హక్కులు కల్పించింది. దళితులు మహారాష్ట్రాల్లో తమిళనాడులో అగ్రవర్ణాల ఆధిపత్యానికి వ్యతిరేకంగా పోరాటం సాగించారు. మహారాష్ట్రలో నవబౌద్ధులు సంప్రదాయంగా వస్తున్నటువంటి పనులు - గ్రామంలో పశువులు చచ్చిపోతే వాళ్లే పారేయడంవంటివి - చేయడానికి తిరస్కరించారు. అగ్రవర్ణాలు ఆగ్రహించాయి. హింసాత్మక సంఘటనలు జరిగాయి. గ్రామాల్లో దళితులు బాయ్‌కాట్ చేశారు. సమకాలీన సామాజిక, రాజకీయ వ్యవస్థను దళితులు తిరస్కరిస్తున్నారు. రాజీలేని పోరాటం సాగిస్తున్నారు.

**మతం–సెక్యులరిజం :** మతం ఒక జీవన విధానంగా వుండేది. మౌలిక సూత్రాలలో అన్ని మతాలు ఒకటే. బాహ్యంగా చూస్తే భేదం కనిపిస్తుంది. మతములెన్నో మార్గాలు అన్ని. కాళిదాసు రఘువంశంలో (10-26) వేదాంత మీమాంసాదిశాస్త్రాలు, పురుషార్థసిద్ధి హేతువులు భిన్నాలుగావున్నా, అన్ని గంగాప్రవాహాలు భిన్నాలైనా చివరకు సముద్రంలో ప్రవేశించినట్లుగానే సిద్ధ్యుపాయాలు నిన్నే చేరతాయన్నాడు. మతసహనం నశించిపోతుంది. 1976లో 42వ రాజ్యాంగ సవరణతో సెక్యులరిజం స్వీకరించాము. స్వీకరణానంతరం మతసహనం క్షీణిస్తూ వస్తోంది. ఆ రోజుల్లో రాజేంద్రప్రసాద్ సోమనాథ దేవాలయంలో బ్రాహ్మణుల పాదాలు కడిగితే నెహ్రూ విమర్శించాడు. ప్రధాని పి.వి. నరసింహారావు సత్యసాయికి పాదాభివందనం చేశాడు. రాష్ట్రపతి, ప్రధాని హిందూమత దేవాలయాలను సందర్శించడం, పూజాదికార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శంకుస్థాపనలు, ప్రారంభోత్సవాలు, కొబ్బరి కాయలు కొట్టి పూజలు జరుపుతున్నారు. పోలీసు స్టేషన్లలో వెంకటేశ్వరస్వామి విగ్రహాలు, ఫొటోలు వుంటున్నాయి. ముస్లిముల హజ్ యాత్రకు టికెట్లులో తగ్గింపులు యిస్తున్నారు. హిందువుల కుంభమేళాకు, మిగిలిన వారికి యివ్వడంలేదు. ఇది ప్రభుత్వ వివక్షతకు నిదర్శనం. హిందువులను బుజ్జగించడానికి అంబేద్కర్ 'రిడిల్ ఆఫ్ రామా' గ్రంథాన్ని ఆపివేయడం, ముస్లింలను జోకొట్టడానికి సాల్మన్‌రష్డీ 'సాటనిక్ వర్సెస్'ను నిషేధించడం, క్రిష్టియన్లను లాలించడానికి క్రీస్తును మానవునిగా చూపారనే నెపంతో 'తమస్'ను నిలిపివేడం వంటివి ప్రభుత్వ అసమర్థతను అద్దంపట్టి చూపుతున్నాయి. సెక్యులర్ రాజ్యాంగం నేతిబీరకాయ చందం. ఇండియన్ పీనల్‌కోడ్ , క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ లలో వున్న చట్టాలు చాలు, ఆయుధాలు నిల్వచేసేవారిని, కులాల, మతాల మధ్య విభేదాలు రెచ్చగొట్టేవారిని నేరస్థులక్రింద ప్రాసిక్యూట్ చేయవచ్చు. కాని చిత్తశుద్ధితో అమలుపరచే రాజకీయ నాయకులు లేరు.

దేశంలో 82 శాతం హిందువులు, 12 శాతం ముస్లిములు, 2.5 శాతం క్రిష్టియనులు, 2 శాతం సిక్కులు వున్నారు. హిందూ, ముస్లిం సంఘర్షణలు పెరుగుతున్నాయి. మతానికి ఆవేశం పొదుగుతు న్నారు. వేర్పాటువాదం ప్రాంతీయతత్వం ముదిరి పోరాట మార్గాన్ని ఎన్నుకుంటున్నారు. స్వర్ణదేవా లయం మీద సైనికచర్య తీసుకోవడంవల్ల, సిక్కుల మనసు గాయపడింది. ఇందిరాగాంధీ హత్య అనంతరం ఢిల్లీలో సిక్కులవధ మరింత తీవ్రతరంచేశాయి పోరాటాన్ని. తత్ఫలితంగా వేలమంది సిక్కులని పంజాబ్‌లో హతమార్చారు. 1989, 91 ఎన్నికల్లో హిందూ మతాభిమాన ప్రాతిపదికగా భారతీయ జనతాపార్టీ మునుపెన్నడూ లేనంతగా ప్రజాభిమానం పొందగలిగింది. కాంగ్రెస్‌కు నెగెటివ్ మాత్రమేగాని భారతీయ జనతాపార్టీకి పాజిటివ్ వోటు కాదంటున్నారు. అయినా అధిక సంఖ్యాకుల మతంవోటు పెరిగింది. హిందువుల్లో సంస్కరణ వాదులున్నారుగాని ముస్లిముల్లో లేరు. ఎక్కడన్నా వున్నా ఉపయోగంలేదు. జీవితానికే ప్రమాదం సంస్కర్తకు. హిందువులలో వారి పవిత్రగ్రంధాలను తీవ్రంగా విమర్శించిన వారున్నారుగాని, ముస్లిములలో విమర్శించిన వారు లేరనాలి. మానవతా దృక్పథం లేకపోవడంవలన మతవాదుల్లో మూర్ఖత్వం, పిడివాదం వదలదు. భారతదేశంలో జన్మించిన వారెవరైనా భారతీయులేనన్న భావం ఏర్పడేవిధంగా ప్రజల్లో ఒక నమ్మకం కలిగించేట్టుగా ప్రభుత్వం వ్యవహరించాలి. ఓట్లకోసం భారతజాతిలో విభేదాలు సృష్టించడంవలన అభద్రతాభావంతో అనర్థాలకు, అపోహలకు దారితీస్తోంది. అశాంతి రేకెత్తుతోంది.

**ఫెమినిజం :** స్త్రీలు సంప్రదాయక విలువలను విస్మరిస్తున్నారు. పరదాలు తొలగాయి. ఎన్ని మార్పులు వచ్చినా కన్యాపితృత్వం దుఃఖం అనేమాట ఈనాటికీ వర్తిస్తుంది. స్త్రీ ఎంత చదువుకున్నా

వరకట్నం యివ్వక తప్పడంలేదు. శాసనాలు వున్నా అమలులేనివిగానే వున్నాయి. వరకట్న మరణాలు పెరుగుతున్నాయి. మహిళలు న్యాయమైన హక్కులకోసం పోరాడుతున్నారు. స్వేచ్ఛగా గొంతు విప్పి మాట్లాడుతున్నారు. ఫ్రాన్సు అమెరికాల్లో ఫెమినిస్టులు నాగరకతకు వ్యతిరేకంగా పోరాడారు. (The Feminist movement of France and America, a revolt against the very foundations of the reason dominated scientific and technological civilisation of the West). స్త్రీని ఆస్తిలో భాగంగా పరిగణించారు. హక్కులు కావాలంటూ బాధ్యతలు విస్మరిస్తే సమాజానికి మేలు జరగదు. స్త్రీ, పురుషులు కుటుంబంలో, ఆర్థికంగా సమాన భాగస్తులైనపుడు పురుషాధిక్యత నశించి ఇద్దరూ పరస్పర సహకారంతో ఉభయుల ఆధిపత్యంతో కుటుంబం నడుపుతారు.

**న్యాయ వ్యవస్థ:** న్యాయ వ్యవస్థలో కూడా అవినీతి చోటుచేసుకుంటోంది. జస్టిస్ రామస్వామి మీద వచ్చిన ఆరోపణ సముద్రంలో మంచుపరత్వంలాంటి మచ్చుతునక. జనతాపార్టీ పతనానంతరం ఇందిరాగాంధీ వచ్చాక జస్టిస్ భగవతి శ్లాఘిస్తూ ఉత్తరం రాశాడు. సంజయ్‌గాంధిని దృష్టిలో వుంచుకుని 'the reddish glow of the rising sun' అన్నాడు. జస్టిస్ తుల్జాపుర్కార్ 1980 మార్చి 21న ఇండియన్ లా ఇన్‌స్టిట్యూట్ ఢిల్లీలో జరిగిన డిప్లొమా ఎవార్డింగు ఫంక్షన్‌లో యిచ్చిన ఉపన్యాసంలో ఇటువంటివారిని తీవ్రంగా విమర్శించాడు. జడ్జీలు అధికార రాజకీయ నాయకులచుట్టూ, లా సెక్రటరీల చుట్టూ విదేశీయానం ఛాన్సుకోసమో, పదవులకోసమో, పుత్రులకోసమో ప్రదక్షిణలు చేస్తున్నారన్నాడు. రాజకీయ నాయకుడు ఎవడైనా గెలిస్తే దండలు వేయడం, డిన్నర్లు, మత్తుమందు పార్టీలలో కలవడం, స్తుతించడం, ఉత్తరాలు రాయడంవంటి సిగ్గుచేటైన పనులవలన ప్రజల్లో న్యాయవ్యవస్థ అన్యాయానికి నిలయమయింది. వున్న గౌరవం మంట కలిసిపోతుందన్నాడు. ధనికులకు ఒకన్యాయం, పేదలకు మరొకన్యాయం అమలు జరుగుతోంది ప్రజస్వామ్యంలో. రాజకీయ అధికారంలో వున్నపార్టీ దత్తంచేసిన విధినిర్వహణలో ఉద్యోగులు కొన్ని సత్యాలను బయటపెట్టక తప్పదు. ప్రజాస్వామ్యంలో పార్టీలు మారుతుంటాయి. అధికారం చేతులు మారుతుంది. ఇందిరాగాంధీ తిరిగి అధికారంలోకి వచ్చాక కక్ష సాధింపుచర్యలు ఉన్నతోద్యోగులమీద తీసుకుంది. అందుకు ఉదాహరణ వి.వి. నాగర్కార్ సుప్రీంకోర్టుకు పెట్టుకున్న పిటిషను (Justice against Vendetta). నాగర్కార్ పోలీసు డిపార్టుమెంటులో వుంటూ రెండు గ్రంథాలుకూడా వ్రాశారు. ఆయన చేసింది కాంగ్రెసు సావనీర్ ఫండు కేసుమీద విచారణ. ఉన్నతోద్యోగులమీద కక్ష సాధింపుచర్యను దుష్ట సంప్రదాయంగా ఇందిరా గాంధీ ప్రవేశపెట్టింది. ఉద్యోగులకు భద్రత లేదు. ఈవిధంగా అధికార పార్టీలు ఉద్యోగులమీద కక్ష సాధింపుచర్యలు తీసుకుంటే ఉద్యోగులు ఎదురుతిరగక తప్పదు. ఉద్యోగ విలువలు నశిస్తాయి.

మారుతున్న సమాజంలో విలువలు మారుతుంటాయి. ఏది మారినా నైతిక విలువలు పతనమైనపుడు సమాజంకూడా పతనమవుతుంది. సంపదంతా కొంతమంది గుప్పిట్లో వుండటంవలన పేదలు ఏదో ఒకనాటికి తిరుగుబాటు చేయకతప్పదు. భారతదేశంలో ఏ సంక్షోభం ఏర్పడినా ఎవరో ఒక మహాత్ముడు జన్మించి ప్రజలకు విముక్తి కలిగిస్తున్నాడు. ప్రజల్లో తిరుగుబాటు మనస్తత్వం కనిపిస్తూనే వుంది. సమకాలీన సమాజంలో మానవతా విలువలు పరిరక్షించుకోవడం మేధావుల, రచయితల, ప్రజల కర్తవ్యం.

**Politics is continuation of a war in other means**

**- French Philosopher**

# అమెరికాలోని
# వింత జానపదులు

**డా॥ సంజీవ దేవ్**

దేశం అంటే మట్టి కాకపోవటం ఏమిటి? దేశం అంటే ప్రధానంగా మట్టియే. మట్టి పుట్టిన తరువాతనే కోట్ల కోట్ల సంవత్సరాలకు మనుషులు పుట్టటం జరిగింది. కనుక దేశం అంటే మట్టీ, మనుషులుకూడ; ముందుగా మట్టీ, తరువాత మనుషులు.

విదేశీ పర్యటనల్లో ఒకో వ్యక్తికి ఒకో అభిలాష. కొందరికి ప్రకృతిని చూడటం ఇష్టం. ఐతే మరికొందరికి మానవులను చూడటం ఇష్టం. ఇంకొందరికి రెంటినీకూడా చూడటం ఇష్టం. నేను ఈ మూడో తెగకు చెందుతాను. ప్రకృతీ మనుషులూకూడ నాకు ఒకేమాదిరి ఇష్టమైనప్పటికీ ఎక్కువ మొగ్గు ప్రకృతిమీదనే వుంటుంది.

ఈ వేసవిలో జరిగిన అమెరికా పర్యటనలో ఎక్కువగా అరణ్యాలను, కొండలను, లోయలను, నదీనదాలను, పొలాలను, వ్యవసాయాలు మొదలైన వాటిని చూడటం జరిగింది. అమెరికా అంటే అరణ్యాలు అనవచ్చు. అమెరికాలో అరణ్యాలున్నాయా లేక అరణ్యాల్లో అమెరికా వున్నదా అని తేల్చి చెప్పటం కష్టం. అందువల్ల అమెరికాలో అరణ్యాలున్నాయి, అరణ్యాల్లో అమెరికా వున్నదని చెప్పాలి.

ఏ దేశంలో అయినా నగరాలన్నీ ఒకే విధంగా గోచరిస్తాయి దాదాపు; పల్లెలూ, ప్రాకృతిక ప్రదేశాలూ మొదలైనవాటిలో కొంత భేదం కనిపిస్తుంది. ఆ భేదమే నగరవాసుల్లోకంటే జానపదుల్లో ఎక్కువ గోచరిస్తుంది.

అమెరికాలోని పెన్సిల్వేనియా రాష్ట్రంలో, లాంకాస్టర్ కౌంటీలో రైతాంగానికి చెందిన 'ఆమీష్' అనే ఒక జాతి వారున్నారు. వారి జీవన విధానంలో, వారి రీతి రివాజుల్లో, వారు నిత్య జీవితంలో వాడుకొనే వస్తుసామగ్రిలో, వాహనాల వాడుకలో ఎంతో అంతులేని తారతమ్యం గోచరిస్తుంది. వారంతా ఆధునిక నాగరికతకు దూరంగా వుంటారు. నగరాలకు దూరంగా, ఆధునిక వైజ్ఞానిక ప్రగతికి అంటకుండా, కర్షకులుగా, అతి సాదాగా జీవిస్తారు.

వారు కారుల్లో ప్రయాణం చేయరు. గుర్రాలమీద, గుర్రపు బగ్గీలలో ప్రయాణాలు చేస్తారు. విద్యుచ్ఛక్తిని ఉపయోగించరు, చమురు దీపాలను వెలిగించుకుంటారు. ఆధునిక యాంత్రిక జీవితానికి వారు వ్యతిరేకులు. దీనంతటికీ కారణమేమని వారిని అడిగితే వారు జవాబు చెపుతారు, ఇవన్నీ బైబిల్ గ్రంథంలో పేర్కొనబడలేదని. బైబిల్‌లో వున్నవాటిని మాత్రమే తాము చేస్తాముకాని లేనివాటిని చేయము అని. అదే విధంగా తలమీది జుట్టూ, గడ్డాలూ, మీసాలనూ కూడ గొరిగించక పెంచుతారు.

వీరి వాసభూమి అంతాకూడ ఫిలడల్ఫియాకు పడమటిగా వుంటుంది. వీరు ఆటవికులు కారు, నాటు రైతులు మాత్రమే. మతాభిమానం వీరిలో ఎక్కువ వుంటుంది.

తమ పూర్వులనుండి ధారావాహికంగా వస్తున్న సనాతన సంప్రదాయాలమీద వారికెక్కువ అభిమానం. పాతను పూజిస్తారు, క్రొత్తకు దూరంగా వుంటారు.

క్రీ.శ. 1700 ప్రాంతంలో స్విట్జర్లాండ్ నుంచీ, జర్మనీనుంచీ ఈ అమెరికాలోని పెన్సిల్వేనియా రాష్ట్రానికి వీరంతా వలసవచ్చారు. తమకిష్టమైన మతాన్ని ఆరాధించే స్వేచ్ఛ కోసం, తమ స్వీయ జీవన సంప్రదాయాలను అమలు జరుపుకుంటూ స్వేచ్ఛగా జీవించటానికీ ఇక్కడు వచ్చి స్థిరపడిపోయారు. వీరుండే ప్రదేశమంతాకూడ కొంత సమతలంగాను, మరికొంత ఎగుడు దిగుడులుగాను, ఇంకొంత వన్యంగానూ వుంటుంది. వీరి వ్యవసాయంలో కూడా ట్రాక్టర్లు మొదలైన యంత్రసామగ్రిని వాడరు. గుర్రాలే నాగళ్లు లాగుతాయి, గుర్రాలే బండ్లను గుంజుతాయి.

కొందరు సుందర ప్రదేశాల్లో నివసిస్తారేకాని ఆ ప్రదేశాల సౌందర్యాన్ని ఆనందించలేరు. కాని ఈ 'ఆమీష్' జాతివారు, స్థానిక సౌందర్యాన్ని ఆనందిస్తారు; ఆనందించటమేకాదు, ఆరాధిస్తారు కూడ. అందుకే అనిపిస్తుంది వీరిలో ఆధునిక నాగరికత ప్రవేశించకపోయినాకూడ సంస్కృతి ప్రవేశించకుండా లేదని. అందాన్ని ఆనందించే వారుంటే ఆనందాన్ని ఆరాధించే వారుంటారు కొందరు.

ఆధునిక నాగరికతకు దూరంగా వుంటూ యంత్ర పరికరాలను వాడకుండా, యాంత్రికంగా నడిచే వాహనాలపై తిరగకుండేవారు కూడ నేడు అటువంటి నియమాలను వదులు చేస్తూ క్రమేణ అందరివలె మనముకూడ సంచరించాలనే వాంఛ నేటి యువతరంలో కనిపిస్తుంది. చికాగో రైల్వే స్టేషన్‌లో రైలుబండి కోసం వేచివున్న ఈ 'ఆమీష్' ప్రయాణీకులను నేను కలుసుకోవటం జరిగింది. యాంత్రిక నాగరికతను నిషేధించి జీవించేవారు రైలు ఎందుకు ఎక్కుతున్నారన్నాను. వారు అందుకు సక్రమ సమాధానం చెప్పలేక ఎమర్జెన్సీ సమయాల్లో తమ నియమాలను వుల్లంఘించటానికి సంశయించటం లేదన్నారు; నేను నవ్వితే వారూ నవ్వి ఊరుకున్నారు. వారి ఇంగ్లీషు నాకు సరీగా బోధపడలేదు.

మారుతున్న సమాజాన్ని చూస్తే అనిపిస్తుంది, కాలవేగం ముందు వీరి నియమాలు కూడ ఎక్కువకాలం నిలవవేమో అని! వేచి చూడాలి వీరిలో ఎంతవరకు మార్పు వస్తుందో అని.

లాన్‌కాస్టర్ కౌంటీ వున్న పెన్‌సిల్‌వేనియా భాగంలో మాత్రమే కాక ఈ 'ఆమిష్' జాతివారు పెన్సిల్‌వేనియాలోని మధ్యభాగంలోను, ఓహియోలో, ఇంకా కెనడా, జర్మనీల లోను కూడ స్థిరనివాసులుగా వుండిపోయారు.

వీరిలో 'ఆమీష్' అనీ, 'మినోనైట్' అనే రెండు తెగలున్నాయి. మొదటివారు తమ సాంప్రదాయిక నియమాలకు ఎక్కువగా కట్టుబడివుంటే రెండవవారు వాటినుంచి కొంత స్వతంత్రంగా వుంటారు. రెండవ ప్రపంచ యుద్ధం నాటినుండి వీరందరిలోకూడ కొంత స్వేచ్ఛ ఎక్కువైంది. అరుదుగా కొందరు మోటారు కార్లలో కూడ తిరగసాగేరు. ఇటువంటి వారిని పాతవారు వెలివేయటం కూడా జరుగుతుండేది. అయినా ఇప్పటికీ సంప్రదాయబద్ధులైన వారే అధికంగా వున్నారు.

ఈ మినోనైట్‌లు అనేవారు చాలా పాత బంధనాలనుంచి విముక్తులు కావటంలో ఉత్సాహం, ఉల్లాసం కనపరచసాగారు. వీరితో చాలామంది మోటార్ కార్లను స్వయంగా

నడపగలరు కూడా. తమ కార్లకున్న బంపర్లకు, ఇతర క్రోమియం భాగాలకు నల్లరంగు వేస్తారు. దీని సూచన ఏమంటే తాము ఆడంబరులం కామని తెలపటం.

ఈ ఆమీష్ జాతివారు తమ ఫోటోలను ఎవరైనా తీస్తుంటే వ్యతిరేకిస్తారు. దేవుడు నిర్మించిన తమ రూపాలకు మానవులు ప్రతిరూపాలను నిర్మించడం పాపం అని వారు నమ్ముతారు. ఇటువంటి నమ్మకం ముస్లిములలో కూడా వున్నది. ఈ ఆమీష్‌లను ఫోటోలు తీయాలంటే వారికి తెలియనీయకుండా చాటుగా తీయాలి. అయితే ఇటువంటి నియమాలన్నీ నేటి యువతలో చాలా దిగజారిపోతున్నాయి.

వీరంతా రైతాంగానికి చెందినవారు కావటంవల్ల ధనం మీదకంటే, ఇతర వస్తుజాలంమీద కంటే భూమిమీదనే ఎక్కువ మక్కువ. తమ కొడుకుకు పెళ్ళికాగానే తల్లితండ్రులు అతనికి కొంత పొలం ఇచ్చి, ఇల్లు కట్టి ఇచ్చి వేరే పంపుతారు. సాధారణంగా రైతు కుటుంబాల్లో ఉమ్మడి నివాసం వాడుకలో వుంటున్నప్పటికీ వీరు వేరువేరు కాపురాలను స్థాపించటానికే ఎక్కువ ఇష్టపడతారు.

ప్రపంచం అంతటా ఆధునిక సామాజిక వ్యవస్థ నూతన రీతిలో రూపం తాలుస్తున్నా కూడా ఈ అమెరికన్ జానపద వ్యవస్థ రూపాంతరం చెందటానికి ఇంకా ఎక్కువ కాలం పడుతుంది. ★

## The Science of beauty, the art of thrill

"Beauty is the proper conformity of the parts to one another and to the whole." Expressed in this way, the idea applies equally to art and to science.

It is true that most scientists do see such basic differences between art and science; but Stent argues that these differences are not profound, and do not run deep.

In physics, too, in the cases of Einstein's general relativity and Dirac's relativistic electron theory, there is something so special and unique in what they did that it is hard to easily accept that these were inevitable discoveries or developments!

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717



# కొత్త రుచులు
# ఆప్కో చేనేతలు

విశిష్టమైన రూపకల్పనల్లో నాణ్యమైన
చేతి అద్దకపు అద్భుతాలు

ఈ తరుణంలో
మీ అభిరుచులకు అనుగుణంగా ఎన్నెన్నో రకాలు
అదునాతనమైన నేతల్లో సాంప్రదాయపు సొంపుల్లో
కళ్లు జిగేలుమనిపిస్తాయి.

అన్ని సందర్భాలలో సరిపోయే సరికొత్తరకాల్లో

## ఆప్కో చేనేతలు

అపూర్వ కళా ఖండాలనుబోలు

గుంటూరు, గద్వాల, వెంకటగిరి జరీ చీరలు;
సిద్ధిపేట, ఉప్పాడ, కొత్తపల్లి, బుటా చీరెలు, పుట్టపాక, నారాయ
ణపేట, ధర్మవరం, పోచంపల్లి టై అండ్ చీరెలు, దుప్పట్లు,
తువ్వాళ్లు, లుంగీలు, ధోవతులు, మరెన్నో చేనేతలు

సామాన్య కుటుంబీకులకు పనికివచ్చే చీరెలు, ధోవతులు చౌక ధరలలో
కంటికింపైన డిజైన్లలో పాలియెస్టర్ చొక్కాలు

## మీకు దగ్గరలోగల ఆప్కో ఫ్యాబ్రిక్స్

విక్రయశాలను నేడే దర్శించండి

''సులభ వాయిదాలపై అరువు సౌకర్యంగలదు''




ది ఆంధ్ర ప్రదేశ్ స్టేట్ హ్యాండ్లూం వీవర్స్
కో ఆపరేటివ్ సొసైటి లిమిటెడ్,
హైదరాబాదు-500 029.